CMP. File.









# కాల్గేట్ డెంటల్ క్రీమ్‌తో నోటి దుర్వాసనను ఆపండి... రోజంతా దంతక్షయాన్ని నివారించండి!




కాల్గేట్ 10 మందిలో 7 గురికి వెంటనే నోటి దుర్వాసనను నివారించినదని, భోజనము అయిన వెంటనే కాల్గేట్ పద్ధతిలో పళ్ళు తోముకొంటే ఎక్కువ దంతక్షయమును, ఎక్కువ మందికి అరికట్టిన దని దంతశాస్త్ర చరిత్రలో పూర్వము ఎవ్వరూ ప్రకటించబడనటు శాస్త్ర పరీక్షలు నిరూపించేయి. ఎందుకంటె: కాల్గేట్ డెంటల్ క్రీమ్‌తో ఒకసారి పళ్ళు తోముకొంటేనే 85% వరకు నోటి దుర్వాసన మరియు దంతక్షయమును కలిగించే సూక్ష్మ క్రిములు పోతాయి. కాల్గేట్‌కు మాత్రమే యీ ఋజువు ఉన్నది! ఎంతో చక్కని పెప్పర్‌మెంట్ రుచి కూడ ఉంది—కాల్గేట్ డెంటల్ క్రీమ్‌తో రోజూ పళ్ళు తోముకొనుటకు పిల్లలు ఇష్టపడతారు!




శుభ్రమైన, తాజా శ్వాసకు మరియు తెల్లగా మెరిసే పళ్ళకు...ఎక్కువమంది జనులు ప్రపంచములో ఏ యితర టూత్‌పేస్ట్‌కంటె కాల్గేట్‌నే కొంటారు!

DC.G.41. TL

# చందమామ

ఏప్రిల్ 1970

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



ఇవి గాక ఫోటో శీర్షికల పోటీ
మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.

★

విడి ప్రతి 75 పైసలు

సంవత్సర చందా రూ. 9/-









# బ్రూక్ బాండ్ A-1 డస్ట్ ప్యాకెట్టుకు హెచ్చు కప్పుల మంచి టీ

BB 5381

# బినాకా షార్ట్ హెడ్




## మరిచిన్నకొసలతో



... మరే విధంగానూ చొరబడలేని పగుళ్ళలోకి చొరబడి

**శుభ్రపరుస్తుంది**

... మరి ఏ టూత్ బ్రష్ చొచ్చుకుపోలేని మూలల్లోకి

**చొచ్చుకుపోతుంది**

బినాకా షార్ట్ హెడ్ కొసలు గుండ్రంగా ఉంటాయి—ఇగుళ్ళను ఏమాత్రం గాయపరచవు



**బినాకా టూత్ బ్రష్ వట్టి టూత్ బ్రష్ మాత్రమే కాదు, అంతకన్న కొంత అధికం.**

Binaca®

ULKA-CTB-65 TEL

# చందాదారులకు గమనిక!

'చందమామ' కాపీలు పంపుటకు మీ చిరునామాలో ఏదైనా మార్పుంటే 5-వ తేది లోగానే, మీ చందా నంబరు ఉదహరిస్తూ, మాకు తెలపాలి. ఆలస్యమైతే మళ్ళీ నెల వరకు మీ కొత్త అడ్రసును అమలు పెట్టడానికి వీలుండదు.

డాల్టన్ ఏజన్సీస్

'చందమామ బిల్డింగ్స్'

మదరాసు - 26



# చందమామ

సంచాలకుడు: 'చక్రపాణి'

ఈ సంవత్సరం గాంధీ శతజయంతి జరిగినట్టే లెనిన్ శతజయంతి కూడా జరుగుతున్నది. ఈ మాసంతో లెనిన్ పుట్టి నూరేళ్ళు నిండుతున్నాయి. "అక్టోబరు" విప్లవం ద్వారా రష్యాలో మొట్టమొదటి సోషలిస్టు వ్యవస్థను ప్రపంచంలో ఏర్పాటుచేసి, మానవ చరిత్రను ఒక పెద్ద మలుపు తిప్పిన వాడు లెనిన్. లెనిన్ బాల్యానికి చెందిన సంఘటనలను ఈ సంచిక నుంచి ప్రచురిస్తున్నాం. ఇది "చందమామ" పాఠకుల కోసం ప్రత్యేకం.

సంపుటి 46 ఏప్రిల్ '70 సంచిక 4



CHITRA



# మంగమ్మ ప్రశ్న

ఒక గ్రామంలో భద్రయ్య అనే మోతుబరి రైతు ఉండేవాడు. అతని ఇంటి పక్కనే మంగమ్మ అనే పేదరాలు గుడిసె వేసుకుని, అందులో ఉంటూ, పూలు పెంచి అమ్ముకుని తన అయిదేళ్ల మనవడితో జీవిస్తూ ఉండేది.

మంగమ్మ గుడిసె ఉన్న అవరణ తన ఆవరణతో కలుపుకోవాలని భద్రయ్యకు దుర్బుద్ధి పుట్టింది. అతను మంగమ్మను పిలిచి, "చూడు, మంగమ్మా, నేను మా ఇంటిని పెంచాలనుకుంటున్నాను. నీ స్థలం నాకు ఇచ్చెయ్యి. నీకు నష్టం లేకుండా అంతో ఇంతో ముట్టజెప్పుతాలే," అన్నాడు.

అందుకు మంగమ్మ ఒప్పుకోలేదు.

''నాకూ, నా మనవడికీ ఉన్నదే ఆ గుడిసె. దాన్ని వదిలేసి ఎక్కడికి పోను? అదే మా పంచ ప్రాణాలు. నా భర్తా, కోడలూ, కొడుకూ ఆ గుడిసెలోనే చనిపోయారు. నా ప్రాణాలు కూడా ఆ గుడిసెలోనే పోతే నాకు తృప్తి,'' అన్న దామె భద్రయ్యతో..

నయాన మంగమ్మను ఒప్పించలేక భద్రయ్య ఆమెను బెదిరించాడు: "నువా గుడిసెను రేపటిలోగా ఖాళీ చేసి తీరాలి," అన్నాడు.

''నేను నా గుడిసెను ఎందుకు ఖాళీ చెయ్యాలి? ఏ లెక్క ప్రకారం?'' అని మంగమ్మ అడిగింది.

భయాన కూడా మంగమ్మ లొంగకపోయే సరికి భద్రయ్య దౌర్జన్యానికి దిగాడు. అతను తన పాలేర్లను పిలిచి గుడిసెలోని సామాన్లు బయట పారేయించి, గుడిసెను పీకించేశాడు.

మంగమ్మ ఏడుస్తూ వెళ్ళి తనకు జరిగిన అన్యాయాన్ని గ్రామ పెద్దలకు చెప్పు

ఎస్. శారదారామం

కున్నది. గ్రామ పెద్దలు పంచాయతీ జరిపి, భద్రయ్యను కూడా పిలిపించి సంజాయిషీ అడిగారు.

"ఈ ముసలిదాని కొడుకు బతికి ఉండగా నా దగ్గిర వందరూపాయలు అప్పుగా తీసుకుని, పత్రం రాసి ఇచ్చాడు. దీని భర్తగాని, ఈ ముసలిదిగాని ఇంత వరకు వడ్డీ అయినా చెల్లు వెయ్యలేదు. అసలు వడ్డీల కింద నేను వాళ్ళ గుడిసెను స్వాధీనం చేసుకున్నమాట నిజమే," అంటూ భద్రయ్య ఎవరిదో వేలి ముద్ర ఉన్న దొంగ పత్రాన్ని గ్రామపెద్దలకు చూపాడు.

గ్రామపెద్దలు ఆ పత్రాన్ని నమ్మి భద్రయ్యకు అనుకూలంగా తీర్పు చెప్పారు. ముసలిదానికి న్యాయం జరక్కుండాపోయింది.

తరవాత ముసలి మంగమ్మ మరొక చోట గుడిసె వేసుకుని, పూర్వంలాగే పూలు అమ్ముకుంటూ కాలక్షేపం చెయ్య సాగింది.

కొద్ది రోజులు గడిచాయి. భద్రయ్య మంగమ్మ గుడిసె ఉండిన చోట పునాదులు తవ్వించ సాగాడు. ఒకనాడు మంగమ్మ తన మనవణ్ణి వెంట బెట్టుకుని తవ్వకాలు జరిగే చోటికి వచ్చింది.



భద్రయ్య ఆమెను చూచి, ''ఏం ఇట్లా వచ్చావు ?'' అని అడిగాడు.

''తమరు గొప్పవారు. నేను పేద ముండను. నువు నన్ను కనికరించదగిన వాడివి. నీ నుంచి ఒక చిన్న సహాయం కోసం వచ్చాను,'' అన్నది మంగమ్మ.

''ఏమిటా సహాయం ?'' అని భద్రయ్య అడిగాడు.

''నా మనవడు పాతచోటు చూపించమని రోజూ ఒక టే పోరు,'' అన్నది మంగమ్మ.

''చూపించావుగా ? ఇక వెళ్ళు,'' అన్నాడు భద్రయ్య.

''పోతాను. ఒక గంపెడు నా గుడిసె మన్ను ఇప్పించు, బాబూ. దానితో పొయ్యి వేసుకుని, వండుకు తింటూ తృప్తి పడతాం,'' అన్నది మంగమ్మ.

ఆ పిచ్చి కోరిక విని భద్రయ్య నవ్వి, ''సరే తీసుకుపో,'' అన్నాడు. మంగమ్మ ఒక గంప నిండా పాతగుడిసె మన్ను నింపుకుని, ''బాబూ, నీకు పుణ్యం ఉంటుంది, కాస్త ఈ గంప నీ చేతిమీదిగా నా నెత్తి కెత్తు,'' అన్నది.

భద్రయ్య గంప ఎత్తబోయాడు. కాని అంత బరువు ఎత్తటం అతని వల్ల కాలేదు. మళ్ళీ మళ్ళీ ప్రయత్నించాడు. ముచ్చెమటలు పోశాయేగాని, ప్రయోజనం లేక పోయింది.

మంగమ్మ గట్టిగానవ్వి, ''ఈ గంపెడు మన్ను మోయలేని వాడివి ఇంత మన్నూ ఎలా మోద్దామనుకున్నావు, నాయనా ?'' అని ప్రశ్నించింది.

భద్రయ్యకు అవమానమయింది. అవమానంతో బాటు జ్ఞానోదయం కూడా అయింది. తాను చేసిన పనికి సిగ్గుపడి, అతను ఆ తవ్విన పునాదులతోనే మంచి ఇల్లు కట్టించి, దాన్ని మంగమ్మకు ఇచ్చేశాడు.





# తేలుకుట్టినదొంగ

పూర్వం ఒక గ్రామంలో ఇద్దరు స్నేహితులు ఉండేవారు. వారిలో ధర్మయ్య స్నేహపాత్రుడు, రామయ్య కొంచెం పిసినారి. ధర్మయ్యకు సంతానం లేదు. అందుకని అతను తీర్థయాత్రలు చేద్దామనుకున్నాడు. అతని వద్ద రెండువందల వరహాలు నగదున్నది. అందులో ఒక వంద దారి ఖర్చులకు ఉంచుకుని, మిగిలిన వందా ఎక్కడన్నా భద్రంగా దాద్దామనుకున్నాడు. దాన్ని ఎక్కడ దాయాలో తోచక, రామయ్యను సలహా అడిగాడు.

"నా దగ్గిర నీ సొమ్ము ఉంచగలనుగాని, ఖర్చయిపోతుందని భయం. అందుచేత, ఊరి బయట ఉన్న మర్రిచెట్టు కింద సొమ్ము పాతిపెట్టావంటే నువు తిరిగివచ్చి తీసుకోవచ్చు," అన్నాడు రామయ్య.

ధర్మయ్యకు ఈ సలహా నచ్చింది. అయితే పట్టపగలు సొమ్ము తీసుకుపోయి మర్రిచెట్టు కింద పాతిపెడితే ఎవరైనా చూసి, తవ్వి తీసుకోవచ్చు, అందుచేత రాత్రి మాటుమణిగినాక ఆ పని చేతామనుకున్నాడు ధర్మయ్య. కాని చీకట్లో పడి ఒంటరిగా వెళ్ళటానికి భయంవేసి, రామయ్యను తోడు తీసుకుని వెళ్ళి, వంద వరహాలూ మర్రిచెట్టు కింద పాతిపెట్టి, తెల్లవారుఝామునే ధర్మయ్య తన భార్యతో సహా కాశీకి బయలుదేరి వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి రామయ్య చాలా పొద్దుపోయి ఇంటికి రావటం చూసి, అతని భార్య బంగారమ్మ కారణం అడిగింది. రామయ్య, ధనం దాచిన సంగతి భార్యకు చెప్పేశాడు. ఆ మాట వినగానే బంగారమ్మకు దుర్బుద్ధి పుట్టుకొచ్చి, ఆ సొమ్ము తీసుకురమ్మన్నది. రామయ్య మొదట ఒప్పుకోలేదు. కాని, బంగారమ్మ బావిలోపడి చస్తానని బెదిరించినాక, రామయ్య పెళ్ళాం చెప్పిన ప్రకా

ఎం. రామలింగేశ్వరరావు

రమే వెళ్ళి, మర్రిచెట్టు కింద దాచిన ధనం తవ్వి తీసుకొచ్చాడు. దాంతో బంగారమ్మ నగానట్రా చేయించుకుని, వంటినిండా తగిలించుకున్నది.

కొంతకాలానికి ధర్మయ్య కాశీయాత్ర ముగించి స్వగ్రామానికి తిరిగివచ్చి, అప్పటి కప్పుడే మర్రిచెట్టు వద్దకు వెళ్ళి, ధనం దాచినచోట తవ్వి చూశాడు. సొమ్ములేదు. ధర్మయ్య తిన్నగా గ్రామపెద్ద వద్దకు వెళ్ళి తనకు జరిగిన అన్యాయం గురించి చెప్పుకున్నాడు.

గ్రామపెద్ద ధర్మయ్య చెప్పినదంతా విని, "లాభంలేదు, ధర్మయ్యా. నువు అడిగినంత మాత్రాన రామయ్య నీ డబ్బు తిరిగి ఇవ్వడు. అసలు నువు డబ్బు పాతి నట్టు సాక్ష్యమే లేదు. అందుచేత ఒక పని చెయ్యి," అని ధర్మయ్యకు ఒక మంచి ఉపాయం చెప్పాడు.

గ్రామపెద్ద ఇంటి నుంచి ధర్మయ్య రామయ్య ఇంటికి వెళ్ళాడు. ధర్మయ్యను చూడగానే రామయ్య గుండె గుభేలు మన్నది. అయితే ధర్మయ్య వాలకం చూస్తే, అతనికి తన సొమ్ముపోయిన సంగతి ఇంకా తెలిసినట్టు కనబడలేదు. ధర్మయ్య ఇంకా మర్రిచెట్టు దగ్గిరికి వెళ్ళి నట్టు లేదు, అనుకుని కాస్త ధైర్యం తెచ్చు



కుని, "ఏం ధర్మయ్యా, ఇదేనా రావటం? యాత్ర సుఖంగా జరిగిందా?" అని రామయ్య కుశలప్రశ్నలు వేశాడు.

"ఆ, నీ దయవల్ల ప్రయాణం దివ్యంగా జరిగింది. అయితే, చూడూ, మనం మరో సారి మర్రిచెట్టు దగ్గిరికి వెళ్ళి రావాలి. ఎందుకంటే, నేను బయలుదేరిన వేళా విశేషం ఏమిటోగాని, ఈ యాత్రలో వెయ్యి వరహాలు సంపాదించుకొచ్చాను. ఈ వెయ్యి వరహాలూ పాతమొత్తంతో కలిపి పాతిపెట్టి, అట్లా రామేశ్వరయాత్ర కూడా చేసుకొద్దా మని నిశ్చయించాను. రేపు రాత్రికి నేను మీ యింటికి వస్తాను. మన మిద్దరమూ కలిసి మర్రిచెట్టు దగ్గిరికి పోదాం. సరేనా?" అన్నాడు ధర్మయ్య.

ఇద్దరూ కలిసి మర్రిచెట్టు దగ్గిరికి పోవా లనే సరికి రామయ్య భయపడిపోయాడు. సరేనని తల ఆడించి ధర్మయ్యను పంపేసి, రామయ్య తన భార్యతో, "కొంప మునిగిందే!" అంటూ ధర్మయ్య అన్న మాటలు చెప్పి, "రేపు రాత్రి నేను ఏ మొహం పెట్టుకుని ధర్మయ్య వెంట ఆ మర్రిచెట్టు దగ్గిరకు వెళ్ళను? నా దొంగతనం బయట పడిపోదూ?" అన్నాడు.

"ఈ భాగ్యానికే భయపడతారేమండీ? నా నగలన్నీ తాకట్టుపెట్టి ఓ నూరు వర



హాలు పట్టుకొచ్చి మర్రిచెట్టు కింద పాతి పెట్టండి. అవి చూసుకుని ధర్మయ్య ధైర్యంగా తన వెయ్యి వరహాలు కూడా పాతిపెడతాడు. ఆయన అట్లా రామేశ్వరానికి ప్రయాణమైపోగానే మనం మొత్తమంతా తవ్వి తెచ్చుకుందాం," అన్నది బంగారమ్మ.

రామయ్య తన భార్యకు గల సూక్ష్మబుద్ధిని మెచ్చుకుని, ఆమె నగలన్నీ తీసుకుపోయి తాకట్టుపెట్టి నూరు వరహాలు తెచ్చి, వాటిని తీసుకుపోయి, ఆ రాత్రి మర్రిచెట్టు కింద పాతచోట పాతిపెట్టి ఇంటికి తిరిగి వచ్చాడు.

మర్నాడు రాత్రి రామయ్య ధర్మయ్య కోసం చాలాసేపు ఎదురు చూశాడు. కాని ధర్మయ్య జాడలేదు. అర్ధరాత్రి అయింది. రామయ్య ధర్మయ్య ఇంటికి వెళ్ళి తలుపు తట్టేసరికి, మంచి నిద్రలో ఉన్న ధర్మయ్య కళ్ళు నులుపుకుంటూ లేచివచ్చి, "ఏం, రామయ్యా? అర్ధరాత్రివేళ వచ్చావు?" అని అడిగాడు.

"ఈ రాత్రికి మర్రిచెట్టు కిందికి పోదామంటివిగా?" అన్నాడు రామయ్య.

"ఓ అదా? నీకు తెల్లవారి చెబుదామనుకుంటున్నాను, రామయ్యా. నేను ప్రస్తుతానికి రామేశ్వరం ప్రయాణం మానుకున్నాను. అందుచేత సాయంకాలం అలా వెళ్ళి, మనం పాతేసిన డబ్బు కాస్తా తెచ్చేసుకున్నాను," అన్నాడు ధర్మయ్య.

చేసేదిలేక రామయ్య ఇంటికి తిరిగి వచ్చి, జరిగినదంతా భార్యకు చెప్పాడు.

"అయ్యో, ఎంత మోసం! రెండు వందల వరహాల నగలు తాకట్టులో ఇరకబెట్టితిమే, వాటిని ఎట్లా విడిపించుకోవటం?" అని బంగారమ్మ ఏడిచింది. ఆమెతోబాటు రామయ్యా ఏడిచాడు. కాని ఏం చేస్తారు? తేలు కుట్టిన దొంగలు! కిక్కురుమనటానికి లేదు.






## 28

[శిఖిముఖీ వాళ్ళు రాత్రివేళ ఒక చిన్న లంకలో విడిది చేశారు. వాళ్ళ పడవలను నీట ముంచ వచ్చిన శిథిలాలయ పూజారి బంటు ఒకడు నాంగ్‌సోమ్ చేత చంపబడ్డాడు. నాలుగు రోజుల ప్రయాణం తరవాత వాళ్ళు వృశ్చికలంక చేరారు. అక్కడ శిఖిముఖీ, విక్రమకేసరులకు పాడుబడ్డ దేవాలయం ఒకటి కనిపించింది. తరవాత—]

గుట్ట మీద కనిపించిన పాడుబడ్డ దేవాలయం కేసి శిఖిముఖీ, విక్రమకేసరులు బయలుదేరారు. ఎంతో శ్రమకోర్చి, ఎన్నో ప్రమాదాలను ఎదుర్కొని యీ వృశ్చిక లంకకు వాళ్ళు చేరారు. శిథిలాలయం తమకు యింత సునాయాసంగా కళ్ళ పడుతుందని వాళ్ళు కలలో కూడా అనుకోలేదు.

సూర్యాస్తమయమై, నాలుగు వైపులా చీకటి ముసురుకుంటున్న సమయంలో వాళ్ళిద్దరూ దేవాలయాన్ని చేరారు. కాని, ఆలయప్రాంగణంలో అడుగు పెడుతూనే వాళ్ళు పొందిన ఆశాభంగం అంతా యింతా కాదు. ఆలయం పూర్తిగా శిథిలావస్థలో వున్నమాట నిజం! కాని, తాత విక్రమకేసరి ఊహించినట్టు అందులో శిల్పకళాఖండాలు గాని, స్తంభాలకు బంగారు తొడుగులు గాని ఏమీ లేవు. అంతా పట్టి రాతి కట్టడం. గర్భగుడిలో కాళీదేవిమూర్తిని




స్ఫురింపజేసే ఒక రాతివిగ్రహం, ఒక పక్కకు ఒరిగి వున్నది. గోడలలో వున్న గూళ్ళలో కొన్ని రాతి ప్రతిమలు చెల్లాచెదురుగా పడివున్నవి. ఆలయం ఏదో భూకంపం తాకిడికి గురి అయినట్టుగా శిఖిముఖి, విక్రమకేసరులకు తోచింది.

"కేసరీ, యిది మనం వచ్చిన శిథిలాలయం లాగా లేదు. మీ తాతగారు విన్నదీ, మనకు ఇభ్యజాతివాళ్ళు చెప్పిందీ ఎంతో అద్భుత శిల్పంతో వున్న ఆలయం గదా?" అన్నాడు శిఖిముఖి.

విక్రమకేసరి, శిఖిముఖి మాటకు అవునన్నట్టు తలవూపి, విగ్రహాన్ని సమీపించాడు. అదే సమయంలో ఒక పెద్ద తేలు విగ్రహం వెనకనుంచి గోడవైపుకు చరచరా పాకిపోసాగింది. అది మామూలు తేళ్ళకన్న పదీ పన్నెండంతలు పెద్దదిగా వున్నది. విక్రమకేసరి దాన్ని చంపేందుకు కత్తి ఎత్తేంతలో మరి రెండు తేళ్ళు విగ్రహం వెనక నుంచి బయటికి వచ్చినై.

శిఖిముఖి, విక్రమకేసరి చేయి పట్టుకుని, "కేసరీ, వాటిని చంపేందుకు లేనిపోని శ్రమపడకు. ఇది వృశ్చికలంక! ఈ రాకసి తేళ్ళను చంపదలిస్తే, మనకు మరొక పని చూసుకునేందుకు తీరికే వుండదు," అన్నాడు నవ్వుతూ.

"ఆ మాట నిజమే. మనం వీటి వాత పడకుండా తప్పుకు తిరగటం ఒక్కటే సరైన మార్గం. సరే—యిది మనం అనుకున్న శిథిలాలయం కాదు. ఇప్పుడేమిటి చేయటం?" అన్నాడు విక్రమకేసరి.

శిఖిముఖి తలవంచుకుని ఆలోచిస్తూ దేవాలయం నుంచి బయిటికి వచ్చి, చుట్టూ వున్న కొండల కేసి ఓసారి తలతిప్పి చూసి, "మనం అసలు శిథిలాలయాన్ని కనుక్కోవటానికి, యీ కొండలూ, గుట్టలూ వెతక్క తప్పనిసరిలా వున్నది. కాని, ఆ ప్రయత్నంలో మనం పూజారి దుర్మార్గుణ్ణుంచి

ఎలాంటి బెడదా రాకుండా తగు జాగ్రత్తలో వుండటం అవసరం," అన్నాడు.

"నా కొక అనుమానం కలుగుతున్నది, శిఖీ! పూజారి మనకన్న ముందుగానే, యీ వృశ్చికలంక చేరాడు; అందుకు సందేహం లేదు. ఒకవేళ వాడు యీ సరికే ఆ శిథిలాలయాన్ని కనుక్కొని, అక్కడి అమూల్యమైన వస్తువులను హరించి పారి పోయి వుండడు గదా?" అన్నాడు కేసరి.

ఆ మాటలకు శిఖిముఖి నవ్వి, "అను మానాలతో, సందేహాలతో మనం బుర్రలు వేడెక్కించుకోవటం మంచిది కాదు. రేపు సూర్యోదయంతోనే మనం యీ లంక అంతా శిథిలాలయం కోసం గాలిద్దాం. ఒకవేళ పూజారి మనకా సమయంలో తటస్థపడితే, వాడి అంతు చూద్దాం. ఈ సరికే వాడు శిథిలాలయం చేరటం కల్ల," అన్నాడు.

ఆ తరవాత యిద్దరూ మౌనంగా పడవల దగ్గిరకు వచ్చి, అక్కడ వున్న వాళ్ళకు తాము చూసిన శిథిలదేవాలయాన్ని గురించి చెప్పారు. ఈ లంకలో అలాంటి శిథిలాల యాలు చాలా వుండవచ్చన్నాడు, నాంగ్ నోమ్. ఒకప్పుడీ లంకలో ఇభ్యజాతివాళ్ళు వేలసంఖ్యలో వుండేవాళ్ళని కులపెద్దలు చెప్పగా విన్నాననని అతడు చెప్పాడు.



తరవాత వంట పని ముగించి, అందరూ భోజనాలు చేశారు. ఆ సరికి బాగా పొద్దు పోయింది. చంద్రకాంతిలో చుట్టూ వున్న కొండలూ, మహా వృక్షాలూ మిలమిలా మెరిసి పోతున్నవి. పడవలకు జాంగ్‌లాను కాపలా పెట్టి, అందరూ నిద్రలకు ఉపక్ర మించారు.

బాగా అదమరిచి నిద్రపోతున్న శిఖిముఖి, నడి రాత్రివేళ దాపుల నేదో చప్పుడై చప్పున కళ్ళు తెరిచాడు. జాంగ్‌లా కుంటుతూ అతణ్ణి సమీపిస్తున్నాడు. వాడేదో ద్రోహం తల పెట్టాడన్న ఆలోచన శిఖిముఖి మెదడులో మెరుపులా కదిలింది. ఆ వెంటనే





"ఎవరైందీ తెలియటం లేదు. నేల బారున పడుకుని జాగర్తగా వినండి. ఏదో డప్పుల మోత అస్పష్టంగా వినబడు తున్నది...అదుగో, ఇప్పుడు మరింత స్పష్టంగా వినవస్తున్నది!" అంటూ జాంగ్‌లా దాపుల నున్న చెట్ల కేసి తల తిప్పాడు.

ఆ సరికి శిఖిముఖికి కూడా ఆ చప్పుళ్ళు స్పష్టంగా వినిపించినై. ఆ వెంటనే అతడు విక్రమకేసరీ, తతిమ్మా వాళ్ళు కూడా వినేట్టుగా పెద్ద గొంతుతో, "శత్రువులు! లేవండి!" అన్నాడు.

అతడు పక్కన వున్న కత్తిని చేతికి తీసుకుని, లేచి నిలబడ్డాడు.

జాంగ్‌లా ఓ క్షణకాలం నిర్విణ్ణుడై, అంతలోనే స్థిమితపడి, "శిఖి దొరా! నేను దొంగలా మిమ్మల్ని చంపటానికి వచ్చానను కుంటున్నారా? ఇంకా నన్ను తమరు నమ్మ లేదన్నమాట! నేను వచ్చింది, తమను అపాయం రాబోతున్నదని హెచ్చరించ టానికి!" అన్నాడు.

తన తొందరపాటుకు శిఖిముఖి కొంచెం సిగ్గుపడి, "అపాయమా? ఎవరా శత్రు వులు? శిథిలాలయ పూజారా?" అని అడిగాడు.

విక్రమకేసరితో పాటు అందరూ ఒక్క సారిగా నిద్రమేల్కొన్నారు. ఏదో ప్రమాదం రానున్నదని గుర్తిస్తూనే ప్రతి ఒక్కడూ ఆయుధాలు చేతికి తీసుకోబోయారు. కాని అంతలో వాళ్ళను అన్ని వైపుల నుంచీ పాతికా ముప్పై మంది వికృతాకారులు చుట్టు ముట్టారు. వాళ్ళల్లో ఒకడికి తల మీది నుంచి కళ్ళను కప్పి వేస్తూ, తేలు ఆకారంగల టోపీ వున్నది. దానికి పొడిచిన రంధ్రాల్లో నుంచి వాడి కళ్ళు మిలమిలా మెరుస్తున్నవి.

తేలుటోపీ వాడు చేతిలో వున్న రాతి గొడ్డలిని పైకెత్తి తన అనుచరులతో, "నాకు కలలో వృశ్చికమాత కనిపించి చెప్పింది





వీళ్ళను గురించే! వీళ్ళలో యోగ్యుడైన వాడిని బలియిస్తే, ఏ ప్రమాదం లేకుండా మనం వృశ్చికమాత మందిరంలో ప్రవేశించ వచ్చు," అన్నాడు.

ఈ వికృతాకారులు వృశ్చికలంకలోని ఆదిమవాసులనీ, యిప్పటి పరిస్థితుల్లో వాళ్ళను ఎదిరించటం ప్రమాదకరమనీ శిఖిముఖి గ్రహించాడు. విక్రమకేసరితో అతడా మాట అనగానే, అతడు కూడా అందుకు అంగీకరించాడు.



ఈ లోపల నాంగ్‌సోమ్, శిఖిముఖిని సమీపించి, "వీళ్ళు మాట్లాడే భాష మా ఇభ్యుజాతివాళ్ళు మాట్లాడేదానికి చాలా దగ్గిరగా వున్నది!" అన్నాడు.

"అందువల్ల మనకేమైనా మేలు కలుగుతుందంటావా? మనం ఏ దురుద్దేశంతోనూ యీ లంకకు రాలేదనీ, తుఫాను దెబ్బకు పడవలు యీ లంక చేరినవనీ చెప్పు!" అన్నాడు శిఖిముఖి.

నాంగ్‌సోమ్ వాళ్ళ నాయకుణ్ణి సమీపించి, శిఖిముఖి చెప్పమన్న విధంగా చెప్పి, "మనమంతా ఒకే ఇభ్యుజాతికి చెందిన వాళ్ళం మనలో మనకు శత్రుత్వం ఎందుకు? ఉదయం కాగానే మా దారిన మేం పోతాం, అన్నాడు.

ఆ మాటలకు నాయకుడు ఆశ్చర్యపడినట్టు తనవాళ్ళ కేసి చూసి, నాంగ్‌సోమ్‌తో, "మేం ఇభ్యుజాతివాళ్ళ మన్నది ఏనాటి మాట! మాది వృశ్చికజాతి. రెండు రోజుల క్రితం యీ లంకలో శిథిలాలయ పూజారిననే వాడొకడు దిగి, తానూ ఇభ్యుజాతివాణ్ణేననీ, శిథిలేశ్వరి ఆలయం వెతుక్కుంటూ వచ్చాననీ అంటున్నాడు. అతననే శిథిలేశ్వరీ ఆలయం, మేం చెప్పే వృశ్చికమాత మందిరం ఒకటేనని నాకు అనుమానం కలిగింది. రేపు మిమ్మల్ని అతడి గుంపులో చేరుస్తాను. అప్పుడుగాని అసలు మీరంతా ఎందుకు యీ లంక కొచ్చిందీ బయట





పడదు. ఎల్లుండి పౌర్ణమినాడు నేను వెర్రి వెలగపండు తిని, భూగర్భంలో ఆ మందిరం ఎక్కడున్నదో కనుక్కొని, మిమ్మల్నందర్నీ వృశ్చికమాతకు బలిపెడతాను," అన్నాడు.

శిఖిముఖి ఏదో మాట్లాడబోయాడు. కాని వృశ్చికజాతి వాళ్ళ నాయకుడు అతడి కేసి రాతిగొడ్డలి వూపి, తన అనుచరులకు, బందీలందర్నీ వెంట తీసుకురమ్మని చెప్పి, ముందు బయలుదేరాడు.

శిఖిముఖి వాళ్లు చేసేది లేక వాళ్ల వెంట బయలుదేరారు. శిథిలాలయ పూజారి యీ లంక చేరాడనీ, ఏదో ఎత్తులు వేసి శిథిలాలయం ఎక్కడ వున్నదీ తెలుసుకునేందుకు ప్రయత్నిస్తున్నాడనీ శిఖిముఖికి అర్థమై పోయింది. వృశ్చికజాతివాళ్ళ నాయకుడు చెప్పేదాన్ని బట్టి, ఆ ఆలయం యీ లంకలో ఎక్కడో భూగర్భాన కప్పబడి వున్నది. వాడనే వెర్రివెలగపండు సంగతేమిటి?

శిఖిముఖికి కలిగిన యిలాంటి సంశయమే నాంగ్‌సోమ్‌కు కూడా కలిగింది. అతడు తన పక్కగా నడుస్తున్న ఒక వృశ్చికజాతి వాణ్ణి, "వెర్రి వెలగ పండేమిటి? దానికి అంత మహత్తున్నదా? ఎక్కడ దొరుకుతుంది?" అని అడిగాడు.

ఆ ప్రశ్నకు వృశ్చికజాతివాడు చేఎత్తి, దాపుల వున్న రెండు కొండ శిఖరాలను చూపుతూ, "ఆ వెలగపండు వుండే చెట్లు నాలుగైదు ఆ శిఖరాల దిగువనున్న చిన్న కొలను ఒడ్డున వున్నవి. ఆ పండు తిన్న వాడికి భూగర్భంలో ఎక్కడ ఏమున్నదీ తెలిసి పోతుంది," అన్నాడు.

ఈ వెర్రి వెలగపండు మహత్తును గురించి నాంగ్‌సోమ్ గోల్‌ఖరా గ్రామంలో ఇభ్యుజాతి పెద్దలు మాట్లాడుకుంటూండగా చాలాసార్లు విన్నాడు. ఆ పండు ఒక్క వృశ్చికలంక లోనే దొరుకుతుందనీ, అది తిన్నవాడికి లోకం మరోరకంగా కనబడుతుందనీ, వాళ్ళనుకోవటం కూడా అతడికి

తెలుసు. కాని, యీ భూగర్భ రహస్యాలు కనుక్కొనే శక్తి దాని కున్నదని అతడు మొదటిసారిగా యిప్పుడే వింటున్నాడు.

ఏదో విధంగా ఆ వెర్రివెలగపండు సంపాయించి, తినగలిగితే శిథిలాలయం కనుక్కోవటం తేలిక అనీ, తమ సమస్యలన్నీ సునాయాసంగా పరిష్కారమైపోతవనీ, నాంగ్‌సోమ్ ఆలోచించాడు. కాని, ఆ వెలగపండు వున్న చోటుకు చేరాలంటే, తను వృశ్చికజాతివాళ్ళ కళ్ళు కప్పవలసి వుంటుంది....

నాంగ్‌సోమ్ యిలా ఆలోచిస్తున్నంతలో వృశ్చికజాతివాళ్ళ నాయకుడు ఒక కొండ గుహ దగ్గిర ఆగి, పెద్ద గొంతుతో, "బందీలందర్నీ యీ రాత్రికి యిక్కడే నిద్రపొమ్మనండి. ఉదయం కాగానే వాళ్ళ నేంచేయాలో ఆలోచిస్తాను," అని, కొండగుహలోకి పోయాడు.

శిఖిముఖీవాళ్ళు గుహ ముందున్న చెట్ల కింద పడుకున్నారు. వాళ్ళను పట్టుకున్న వృశ్చికజాతివాళ్ళు కూడా దగ్గిరలో అక్కడక్కడా బండరాళ్ళకు చేరగిలబడి కునికిపాట్లు పడసాగారు.

నాంగ్‌సోమ్‌కు యిది మంచి అవకాశంగా కనిపించింది. తాను వెర్రివెలగపండు కోసం శిఖరం కింద వున్న కొలను దగ్గిరికి పోబోతున్నట్టు శిఖిముఖితో చెపుదామనుకున్నాడు



గాని, ఒకవేళ అందుకతడు అభ్యంతరం తెలుపుతాడేమో అన్న భయం కలిగింది. ఆ కారణంగా నాంగ్‌సోమ్ పడుకున్న చోటు నుంచి మెల్లిగా లేచి, కొండ శిఖరం దిగువ నున్న కొలను కేసి బయలుదేరాడు.

నాంగ్‌సోమ్ కొలను ప్రాంతాన్ని చేరేసరికి ఒక వృశ్చికజాతివాడు కొలను పక్కనున్న వెలగచెట్ల కింద అటూ యిటూ పహరా తిరుగుతున్నాడు. వాణ్ణి దెబ్బ తీయకుండా తాను వెలగపండు సంపాయించటం సాధ్యం కాదని నాంగ్‌సోమ్ గ్రహించాడు. ఆ వెంటనే అతడు, ఒక రాతి చాటున దాక్కుని చిన్నగా ఈల వేశాడు.

నాంగ్‌సోమ్ వేసిన ఈల వినపడగానే పహరావాడు, "ఎవరక్కడ?" అంటూ నాంగ్‌సోమ్ దాగివున్న రాతి దగ్గరకు పరి గెత్తుకు వచ్చాడు. నాంగ్‌సోమ్ చప్పున రాతి వెనక నుంచి లేచి, పహరావాడి ముఖంమీద బలంగా ఒక దెబ్బ కొట్టాడు. పహరావాడు కిక్కురుమనకుండా కింద పడిపోయాడు. నాంగ్‌సోమ్ అతడి కాళ్ళూ చేతుల్నీ ఒక బలమైన చెట్టుతీగతో బంధించి, వాణ్ణి రాతికి ఆనించి కూచోబెట్టి, వేగంగా వెర్రివెలగచెట్ల కేసి పరిగెత్తాడు.

ఒకటి రెండు నిమిషాల్లో వృశ్చికజాతి పహరావాడికి స్పృహ వచ్చింది. వాడు వెలగచెట్ల కేసి తలతిప్పి చూశాడు. వాడికి అటుకేసి పరిగెత్తుతున్న నాంగ్‌సోమ్ కని పించాడు. వెంటనే వాడు కట్లు విప్పుకునేం దుకు పెనుగులాడసాగాడు. కట్లు తెగలేదు కాని, పక్కనున్న బండరాయి కదిలింది. అది మీద పడుతుందేమో నన్న భయంతో వాడు భుజం ఆనించి దాన్ని వెనక్కు తోయ బోయాడు. బండరాయి స్థానంతప్పి కిందకు దొర్లసాగింది. దానితో పాటు పహరావాడు కూడా శిఖిముఖివాళ్ళు నిద్రపోతున్న కొండ దిగువకు దొర్లుకు రాసాగాడు.

—(ఇంకా వుంది)






# అతిథిసత్కారం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీ పట్టుదల చూడగా చూడగా నాకు దృఢ వ్రతుడి కథ గుర్తు కొస్తున్నది. అతని పట్టుదలకు దేవతలే లొంగి పోవలసి వచ్చింది. శ్రమ తెలియకుండా ఉండ గలందులకు నీకు అతని కథ చెబుతాను, విను," అంటూ ఇలా చెప్పసాగాడు :

శ్వేతవనంలో దృఢవ్రతు డనే వాడు ఆశ్రమం నిర్మించుకుని ఉండేవాడు. అతను బ్రహ్మచారి, ఒంటరిగాడు. అతను తపస్సు చేసిన వాడు కూడా కాదు, కాని యావజ్జీవం అతిథిసత్కార వ్రత నియమం తప్పకుండా ఆచరించాడు. ఏ వేళలో ఎవరు వచ్చినా సరే అతను

## బేతాళ కథలు



"దయచెయ్యండి, దయచెయ్యండి!" అన్నాడు దృఢవ్రతుడు, ఆ రుషిని లోపలికి ఆహ్వానిస్తూ.

"నేను ఒక్కణ్ణే కాదు. నా వెంట ఇంకా ఏడుగురున్నారు. అందరమూ ఆకలితోనే ఉన్నాం," అన్నాడా రుషి.

"వారిని కూడా లోపలికి రమ్మనండి," అన్నాడు దృఢవ్రతుడు.

అలా అన్నాడే గాని అతని గుండె పిచపిచలాడుతున్నది. అతని కుటీరంలో రెండు దుంపలూ, రెండు మూడు ఫలాలూ మించి లేవు. వాటితో ఎనిమిదిమంది ఆకలి తీరటం అసంభవం. తాను బయటికి వెళ్ళి ఆహారం తేవటానికైనా వేళ గాని వేళ; అరణ్యంలో క్రూరమృగాలు సంచరిస్తూ ఉంటాయి.

అయినా అతను దైవం మీదనే భారం వేసి ఎనిమిదిమంది అతిథులనూ తన కుటీరంలోకి ఆహ్వానించి, "తమరందరూ కొంచెంసేపు కూర్చోండి. నేను త్వరలోనే తమకు ఆహారం సిద్ధం చేసి తీసుకు వస్తాను," అని అగ్నిహోత్రం ఉన్న గదిలోకి వెళ్ళాడు.

అత్యాశ్చర్యకరంగా ఆ గదిలో ఒక మూల కందమూలాల పోగూ, ఫలాల

తన కుటీరంలోకి ఆహ్వానించి, తనకున్న దానిలోనే పెట్టి పంపేవాడు. అతను కుటీరం విడిచి బయటికి వెళ్ళితే కంద మూల ఫలాల కోసమే వెళ్ళేవాడు; తన అవసరానికి మించి తెచ్చేవాడు అందు చేత అతిథులకు పెట్టటానికి అతని వద్ద పండో, ఫలమో ఉంటూనే ఉండేది.

ఇలా ఉండగా ఒకనాడు అర్ధరాత్రి దాటి ఎవరో వచ్చి తలుపు తట్టారు. దృఢవ్రతుడు తలుపు తీసి చూసేసరికి ఒక అజానుబాహువైన రుషి, మంచి తేజస్సు గలవాడు కనిపించి, "ఆకలిగా ఉన్నది. భోజనం పెట్టగలవా?" అని అడిగాడు.

గుట్టా కనిపించింది. అవి ఎలా వచ్చా యన్న విషయం పట్టించుకోకుండా దృఢ వ్రతుడు తన అతిథులకు ఫలాలు ఇచ్చి, వారు వాటిని తినేలోపుగా కందమూల ఫలాలను చక్కగా కాల్చి తెచ్చి వారి ముందుంచాడు.

ఈ ఆతిథ్యంతో అతిథులు చాలా సంతృప్తి చెందారు. వారికి పెద్ద అయిన రుషి దృఢవ్రతుడితో, "పుణ్యాత్ముడివి! ఈ పుణ్యం ఊరికే పోదు. మేమిక వెళ్ళి వస్తాం," అన్నాడు.

"తెల్లవారేదాకా విశ్రమించి వెళ్ళ వచ్చునే!" అన్నాడు దృఢవ్రతుడు.

"మాకు రాత్రీ పగలూ అన్న విచక్షణ లేదు. విశ్రమించటం తరువాత. మేము వెళ్ళవలిసిన దూరం చాలా ఉన్నది," అన్నాడు రుషుల పెద్ద.

ఆయన కుటీరం వెలపలికి దారి తీశాడు. ఆయన అనుచరులు ఒకరొకరే బయటికి పోతున్నారు. అప్పుడు వారిలో ఆఖరువాడు దృఢవ్రతుణ్ణి సమీపించి రహస్యంగా, "పిచ్చివాడా, ఆయనను ఊరికే పోనిస్తున్నావేమిటి? ఏదన్నా వరం అడుగు, ఇస్తాడు. ఆయన ఎవరను కున్నావు? దేవేంద్రుడు. మేము మిగిలిన దిక్పాలకులం!" అన్నాడు.





దృఢవ్రతుడు గబగబా బయటికి వచ్చి రుషుల పెద్దతో, "స్వామీ, కొంచెం ఆగండి. తమరు అనుమతిస్తే ఒక వరం కోరాలని ఉన్నది," అన్నాడు.

దేవేంద్రుడు సంతోషించి, "తప్పకుండా కోరుకో!" అన్నాడు.

"మరేమీ లేదు. నాకు పని లేని వేళలలో పాచికలు ఆడాలని ఉంటుంది. ఎవరిని రమ్మన్నా రారు. నేను పిలిస్తే ఎవడైనాసరే పాచికలు ఆడటానికి వచ్చి, నాతో ఓడిపోయేటట్టు వరం అనుగ్రహించండి. ఇంతకంటె మరేం కోరను," అన్నాడు దృఢవ్రతుడు.



దేవేంద్రుడి ముఖం మాడిపోయింది. ఈ ఆశ్రమవాసి ఉత్తమ; దృష్టిగలవాడై ఉంటాడనీ, బొందితో స్వర్గానికి తీసుకుపొమ్మనో, ఏ అప్సరసనైనా తనకు భార్యగా పంపమనో కోరుకుంటాడనీ దేవేంద్రుడు అనుకున్నాడు. దృఢవ్రతుడు అలాటి కోరిక కోరి ఉంటే దేవేంద్రుడు సంతోషంగా తీర్చేవాడే కూడానూ కాని దృఢవ్రతుడు క్షుద్రమైన కోరిక కోరాడు. అయినా, ఇస్తానన్నాక వరం ఇవ్వక తప్పదు గనక, "నువు అడిగితే ఎలాటివాడైనాసరే నీతో పాచికలు ఆడి ఓడిపోయేటట్టు వరం ఇస్తున్నాను," అనేసి అంతర్ధానమయాడు. ఆయనతో బాటే మిగిలిన దిక్పాలకులూ అంతర్ధానమయారు.

అటు తరవాత దృఢవ్రతుడికి పాచికలతో చక్కగా కాలక్షేపం అవుతూ వచ్చింది. చుట్టుపక్కల ఆశ్రమాల వాళ్ళు వచ్చి అతనితో పాచికలు ఆడి ఓడిపోతూండేవాళ్ళు. అతని అతిథి సత్కారం కూడా అవిచ్ఛిన్నంగా జరిగిపోయింది.

చివరకు ఒకనాడు అతని కోసం యమదూతలు వచ్చారు. తన పాచికలను చేత బుచ్చుకుని దృఢవ్రతుడు కింకరుల వెంట యమధర్మరాజు ఆస్థానానికి వెళ్ళాడు.







అక్కడ చిత్రగుప్తుడు దృఢవ్రతుడి జాబితా చూసి యమధర్మరాజుతో, "ఇతను చాలా పుణ్యాత్ముడు. యావజ్జీవం అతిథి పూజ చేసి స్వర్గంలో కోటి సంవత్సరాల పాటు భోగాలు అనుభవించగలడు. అయితే ఇతనికి పాచికలాడే వ్యసనం ఉన్నందున, ఒక్కసారి నరక సందర్శనం చేయించి స్వర్గానికి పంపేద్దాం,'' అన్నాడు.

యముడి అనుమతితో కింకరులు దృఢవ్రతుణ్ణి నరకమంతా తిప్పారు. నరక యాతనలు అనుభవించే వారిని చూసి దృఢవ్రతుడు చాలా నొచ్చుకుని, ''యముడు తన అతిథులకు చేసే సత్కారం ఇదా?'' అనుకున్నాడు.

నరకం చూడటం పూర్తి అయాక అతను యముడి వద్ద సెలవు పుచ్చుకోబోతూ, ''ధర్మరాజా, నాతో పాచికలు ఆడు. ఒక చిన్న పందెం కూడా పెట్టుకుందాం. నేను ఓడిపోతే నా పుణ్యమంతా ధారపోసి, తిరిగి జన్మ ఎత్తేదాకా ఈ నరకంలో ఉండి పోతాను. నువు ఓడిపోతే నీ నరకంలో ఉన్నవారి నందరినీ నా వెంట పంపెయ్యి,'' అన్నాడు.

చిత్రగుప్తుడు ఆడవద్దని లబలబలాడుతున్నా వినిపించుకోక, దేవేంద్రుడిచ్చిన వర ప్రభావం వల్ల యముడు దృఢవ్రతుడితో పాచికలు ఆడి, ఓడి పోయాడు. అందుచేత ఆయన నరకమంతా ఖాళీ చేసి పాపులందరినీ దృఢవ్రతుడి వెంట పంపక తప్పింది కాదు. యమకింకరులు దృఢవ్రతుణ్ణీ అతని అనుచరులనూ స్వర్గ ద్వారం వద్దకు చేర్చి, అక్కడి ద్వార పాలకుడితో, ''ఈ దృఢవ్రతుడికి యమ ధర్మరాజుగారు కోటి సంవత్సరాలు స్వర్గ సుఖాలు నిర్ణయించారు,'' అని చెప్పి వెళ్ళిపోయాడు.

స్వర్గ ద్వారపాలకుడు దృఢవ్రతుణ్ణి లోపలికి రానిచ్చాడు, కాని అతని వెంట

ఉన్న వాళ్లను రానివ్వక, ''మీరంతా ఎవరు?'' అని అడిగాడు.

''వీళ్ళంతా నా వెంట వచ్చినవాళ్ళు,'' అన్నాడు దృఢవ్రతుడు.

''వీళ్లకు స్వర్గంలో స్థానం లేదు,'' అన్నాడు ద్వారపాలకుడు.

''మీ దేవేంద్రుడు వచ్చి, నా ఆతిథ్యం కోరినప్పుడు ఆయన వెంట వచ్చినవారంతా ఎవరని నేను అడిగానా? ఈ మాట దేవేంద్రుడుగారిని అడిగిరా!'' అన్నాడు దృఢవ్రతుడు.

ఈ మాట దేవేంద్రుడి చెవిని పడింది. ఆయన స్వయంగా వచ్చి దృఢవ్రతుడికి స్వాగతం చెబుతూ, అతని వెంట వచ్చిన పాపులందరినీ స్వర్గంలోకి రానిచ్చాడు.

బేతాళుడీ కథ చెప్పి ''రాజా, దృఢవ్రతుడు యుక్తితో ఇలా పాపులందరికీ స్వర్గ ప్రవేశం కలిగించాడు గదా! ఇది సవ్యంగా ఉన్నదా? ఇంద్రుడు దృఢవ్రతుడి యుక్తిని ఎందుకు సాగనిచ్చాడు? ఈ ప్రశ్నకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''దేవేంద్రుడు దృఢవ్రతుడి యుక్తికి లొంగి పోయాడన్నది సరి కాదు. అతిథి సత్కారమన్నది అత్యుత్తమవ్రతం. అందుకనే, ఆ ఒక్క వ్రతమే ఆచరించి, ఏ తపస్సు చెయ్యని దృఢవ్రతుడికి అంతులేని స్వర్గ సుఖాలు సంప్రాప్తమయాయి. అలాటి వ్రతం అవలంబించిన వాడి పుణ్యం ఎంతమంది పాపాలనైనా పరిహరించగలదు. ఈ సంగతి తెలిసే ఇంద్రుడు పాపులను స్వర్గంలోకి రానిచ్చాడు,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు.

(కల్పితం)





# రట్టులేకుండా

ఒక గ్రామంలో పేరు మోసిన పెద్ద జమీందా రుండేవాడు ఆయనకు ముగ్గురు కొడుకులు. వాళ్ళు పెద్దవారైనాక కూడా ఎంతో అన్యోన్యంగా ఉండేవాళ్ళు. ఒకరినొకరు ఎంతో గౌరవాభిమానాలతో చూసుకునేవారు. వారికి వంశమర్యాద అన్నది ప్రాణంతో సమానం.

జమీందారుగారి ఇంట ఇరవై బంగారు లింగాలుండేవి. అన్నదమ్ములు ఒకరి తరవాత ఒకరుగా వాటికి రోజూ పూజ చేసుకునేవారు. ఇలా జరుగుతూండగా ఒకనాడు బంగారు లింగాలలో ఒకటి మాయమయింది.

అది నిశ్చయంగా దొంగతనమే. దొంగ కూడా ముగ్గురు అన్నదమ్ములలో ఒకరు అయి ఉండాలిగాని, పై వాళ్ళు కావటానికి ఏ మాత్రమూ అవకాశం లేదు. కాని ముగ్గురిలో ఎవరు దొంగ అని తేలినా మిగిలిన ఇద్దరికీ తీరని బాధే. ఆ సంగతి బయటపడితే వంశగౌరవం దెబ్బ తింటుంది. అంతకన్న మరణమే మేలు. అందువల్ల, ఈ ప్రమాదాలన్నీ తప్పాలంటే దొంగ ఎవరో తెలియకుండానే, పోయిన బంగారు లింగం తిరిగి రావాలి. ఎలా?

ఈ సమస్యతో ఆ అన్నదమ్ములు సతమతమయారు. చివరకు పెద్దవాడు నగరంలో ఉండే న్యాయాధికారిని సలహా అడగటానికి బయలుదేరాడు. అతడి వెంటనే రెండోవాడూ, మూడోవాడూ కూడా బయలుదేరారు. న్యాయాధికారి చాలా సూక్ష్మబుద్ధి గలవాడని చెప్పుకునేవారు.

అన్నదమ్ములు ముగ్గురూ న్యాయాధికారి వద్దకు వెళ్ళి, జరిగినదంతా చెప్పి, "ఈ దొంగతనం రట్టు కావటం మాకు

ఎస్. టి. శంకరలింగం

ఎంత మాత్రమూ ఇష్టం లేదు. దొంగ ఎవరో మాకు తెలియ నవసరం కూడా లేదు. పోయిన బంగారు లింగం తిరిగి దొరికితే చాలు. మీ తెలివి తేటలన్నీ ఉప యోగించి, మా లింగాన్ని మాకు తిరిగి ఇప్పించారంటే మా వంశగౌరవం కాపాడి, మాకు మహోపకారం చేసిన వారవుతారు,'' అన్నారు.

''నాయనలారా, మీ సమస్యను అర్థం చేసుకోవటానికే నా తెలివి తేటలు చాల కుండా ఉన్నాయి. దాన్ని పరిష్కరిం చటం నా వల్ల ఎక్కడ అవుతుంది? ఇప్పటికే పొద్దు పోయింది. ఈ రాత్రికి నా ఆతిథ్యం స్వీకరించి విశ్రాంతి తీసు కోండి. రేపు ఉదయం మీ సమస్య గురించి తీరికగా వింటాను,'' అన్నాడు న్యాయాధికారి.

ఆయన లోపలికి వెళ్ళి వచ్చి జమీం దారు కొడుకులతో, ''మీ పూజకు మా అమ్మాయి ఇరవై బంగారు లింగాలను సిద్ధం చేస్తున్నది. మీ అలవాటు ప్రకారం పూజ చేసుకోండి. తరవాత భోజనాలకు కూర్చుందాం,'' అన్నాడు.

ముందుగా పెద్దవాడు లింగార్చనకు వెళ్ళాడు. అర్చన చేసేటప్పుడు అతనికి పంథొమ్మిది లింగాలే కనబడ్డాయి. కాని



అతను ఆ విషయం పైకి ఎవరితోనూ ఏమీ అనక, పూజ ముగించి ఇవతలికి వచ్చేశాడు.

అతని తరవాత రెండోవాడు లింగా లను పూజించటానికి వెళ్ళాడు. అతనికి పంతొమ్మిది లింగాలే కనిపించాయి. కాని అతను కూడా ఆ విషయం పైకి ఏమీ అనలేదు.

తరవాత పూజకు వెళ్ళిన మూడోవాడు కూడా పంతొమ్మిది లింగాలే ఉండటం గమనించి కంగారు పడ్డాడు. తన సొంత ఇంట లింగాన్ని దొంగిలించిన వాడు అతనే. ఆ లింగం ఇంకా అతని వద్దనే ఉన్నది. తన అన్నలు గనక అతన్ని సోదా చెయ్యకుండా వదిలారు. న్యాయాధికారి తన లింగం పోయిందని తనను సోదా చెయ్యవచ్చు. అప్పుడు తాను ఇంటి వద్ద దొంగిలించిన లింగం కాస్తా దొరికి పోతుంది. ఆ భయంతో అతను తన వద్ద ఉన్న లింగాన్ని ఆ పంతొమ్మిది లింగాలతో కలిపి, పూజ ముగించి ఏమీ ఎరగనట్టు ఇవతలికి వచ్చేశాడు.

ఆ రాత్రి గడిచింది. మర్నాడు తెల్ల వారుతూనే న్యాయాధికారి జమీందారు కొడుకులతో, "అదృష్టవశాన మీరు పోగొట్టుకున్న లింగం దొరికింది. ఇదుగో ఆ లింగం. కావలిస్తే గుర్తులు చూసుకోండి. దొంగ ఎవరని నన్ను అడగకండి. ఎందు కంటే, నాకూ ఆ విషయం సరిగా తెలియదు," అన్నారు.

జమీందారు కొడుకులు న్యాయాధికారి ఇచ్చిన లింగాన్ని పరిశీలనగా చూసు కున్నారు. అది తమ ఇంట ఉండిన లింగమే. వారు వచ్చిన పని విజయ వంతంగా ముగిసింది.

అన్నదమ్ములు ముగ్గురూ న్యాయాధి కారికి తమ కృతజ్ఞత తెలుపుకుని, ఇంటికి తిరిగి వెళ్ళిపోయారు.






స్వాయత్త మేకాన్తహితం విధాత్రా
వినిర్మితం ఛాదన మజ్ఞతాయాః,
విశేషతః సర్వవిదాం సమాజే
విభూషణం మౌన మపండితానాం 1.

స్వవశము హితంబు మూఢతాచ్ఛాదనంబు
గాగ నీగతి నిర్మించె కమలభవుడు,
సర్వ విదులగు మనుజుల సభలలోన
మౌనమె విభూషణము మూఢ మానవులకు

శిరశ్శార్వం స్వర్గాత్ పశుపతిశిర స్తః క్షితిధరం,
మహీధ్రా దుత్తుంగా దవని, మవనేశ్చాపి జలధిం,
అధో గంగాసేయం పద ముపగతాస్తోక మథవా,
వివేక భ్రష్టానాం భవతి వినిపాతః శతముఖః 2.

ఆకాశంబున నుండి శంభునిశిరం, బందుండి శీతాద్రి, సు
శ్లోకంబైన హిమాద్రి నుండి భువి, భూలోకంబు నందుండి యు
స్తోకాంభోధి, పయోధినుండి పవనాంధోలోకముం జేరె గం
గా కూలంకష, పెక్కు భంగులు వివేకభ్రష్ట సంపాతముల్



# దొరికిన బిడ్డ

పూర్వం విక్రమసింహుడనే రాజు మగధను పాలించేవాడు. అతనికి చాలాకాలం వరకు సంతానం కలగలేదు.

ఒకప్పుడు ఆ దేశంలో అడవిమృగాల బాధ జాస్తి అయింది. అందుచేత విక్రమసింహుడు అరణ్యప్రాంతాలకు వెళ్ళి వేట చేశాడు. అతను వేట చాలించి తిరిగి వస్తూండగా, అరణ్యంలో ఒక అందమైన బిడ్డ దొరికాడు. విక్రమసింహుడు ఆనందంతో ఆ బాలుణ్ణి తీసుకుని ఇంటికి వచ్చి, వాడికి జయసింహుడు అని నామకరణం చేసి, తన బిడ్డగానే పెంచసాగాడు.

జయసింహుడు దొరికిన కొంతకాలానికి రాణి గర్భవతి అయి, కాలక్రమాన ఒక మగబిడ్డను కన్నది. ఆ బిడ్డకు విజయసింహుడని పేరు పెట్టుకున్నారు. జయ, విజయులిద్దరూ చాలా గారాబంగా పెరగసాగారు.

విక్రముడు ముసలివాడైపోయి, యుక్తవయస్కులైన తన ఇద్దరు కొడుకులలో ఒకరిని యువరాజుగా అభిషేకించ నిశ్చయించాడు. కాని అందుకు తగినవాడు ఆ ఇద్దరిలో ఎవరో ఆయన తేల్చుకోలేక పోయాడు. ఆయనకు ఇద్దరి మీదా సమమైన ప్రేమే. జయుడు పెద్దవాడు, కాని సొంత కొడుకు కాడు; విజయుడు సొంత కొడుకే అయినా చిన్నవాడు; పెద్దవాణ్ణి వదిలేసి చిన్నవాడికి పట్టం కట్టటం భావ్యం కాదు.

ఎటూ తేల్చలేక రాజు తన మంత్రిని సలహా అడిగాడు. మంత్రి జయసింహుణ్ణి యువరాజుగా అభిషేకించమన్నాడు. ఎందుచేతనంటే జయుడు మేధావి, పరాక్రమవంతుడు, ప్రజలకు ఇష్టుడు. అతనితో పోలిస్తే విజయుడు దుర్బలుడు, వక్రబుద్ధి కూడానూ. ఈ సంగతి రాజుకు తెలియక

కుమారి జి. లక్ష్మి



పోలేదు. అందుచేత, మంత్రి సలహాను పాటించి, రాజు జయుణ్ణి యువరాజుగా అభిషేకించాడు. ప్రజలు ఎంతగానో హర్షించారు.

హర్షించనివాడు విజయుడే. తన తండ్రి సొంత కొడుకును కాదని, ఎవడో పరాయివాణ్ణి యువరాజును చేయటం విజయుడికి ఎంతో అక్రమంగానూ, అన్యాయంగానూ తోచింది. ఎప్పటికైనా రాజ్యం జయుడికి దక్కకుండా తానే స్వాధీనం చేసుకోవాలని నిశ్చయించుకుని, తన దురాలోచన బయటికి పొక్కకుండా సమయం కోసం ఎదురు చూడసాగాడు.



కొద్దికాలానికి ముసలిరాజు మరణించాడు. దేశమంతా దుఃఖసముద్రంలో మునిగిపోయింది. అదే తగిన సమయమనుకుని విజయుడు, తమ పొరుగు రాజైన రవివర్మను తమ దేశం మీదికి యుద్ధానికి రావలసినదిగా రహస్యంగా ఆహ్వానించాడు. విచారంలో మునిగి ఉన్న ప్రజలను రవివర్మ తేలికగా జయిస్తాడనీ, తరవాత రాజ్యాన్ని తనకే ఇచ్చేస్తాడనీ విజయుడి ఆశ.

విజయుడి ఎత్తులూ, ఆలోచనలూ ఎప్పటికప్పుడు జయుడు పసి కడుతూనే ఉన్నాడు. అందుచేత అతను, చచ్చిపోయిన రాజుగారి స్థానంలో మరొకరికి రాజ్యాభిషేకం జరగవలసి వచ్చినప్పుడు, విజయుడికే రాజ్యాభిషేకం జరగాలని పట్టుబట్టి, ఆ పని జరిపించాడు.

తాను రాజు కాగానే విజయుడు రవివర్మకు యుద్ధప్రయత్నం మానవలసిందిగా కబురు చేశాడు. విజయుడు మూర్ఖుడని ఆదివరకే గ్రహించిన రవివర్మ, అతను రాజయాడు గనక తనకు విజయం మరింత తేలికగా లభిస్తుందని, యుద్ధానికి బయలుదేరి వచ్చాడు.

విజయుడికి కాళ్లూ, చేతులూ వణికాయి. దేశం పట్టాభిషేక మహోత్సవంలో మునిగి

ఉన్నది; యుద్ధానికి ప్రజలు సిద్ధంగా లేరు. తాను విసిరిన రాయి తనకే తగిలిందని గ్రహించి విజయుడు జయసింహుణ్ణి ఆశ్రయించాడు. జయుడైనా చేయగలది ఏమీ కనిపించలేదు.

"నేనే స్వయంగా రవివర్మ వద్దకు రాయబారం వెళ్ళి అతడి మనస్సు మార్చ యత్నిస్తాను," అన్నాడు జయుడు.

జయుణ్ణి చూడగానే రవివర్మ వెంట ఉన్న వృద్ధులు నిర్ఘాంత పోయారు. జయసింహుడు ముమ్మూర్తులా రవివర్మే. రవివర్మ ఆ వయసులో జయసింహుడి లాగే ఉండేవాడు.

రవివర్మకు రాణులు చాలామంది ఉన్నప్పటికీ చాలా కాలం వారికి పిల్లలు కలగలేదు. అంతలో పెద్ద రాణి ఒక మగ బిడ్డను కన్నది. మిగిలిన రాణులందరూ అసూయ చెంది, అవకాశం దొరకగానే సేవకుల చేత ఆ బిడ్డను అరణ్యంపాలు చేయించారు. విక్రమసింహుడికి దొరికినది ఆ బిడ్డే.

తన కొడుకు కోసం రవివర్మ ఎంతో వెతికించాడు గాని ప్రయోజనం లేకపోయింది. ఆ బిడ్డ అప్పుడు రవివర్మ ఎదటికే వచ్చాడు. పోలికలు అలా ఉండగా, రవివర్మ కొడుకు పోయిన రోజూ, విక్రమసింహుడికి అడవిలో బిడ్డ దొరికిన రోజూ కలిశాయి. జయసింహుడు రవివర్మ కొడుకన్నది పూర్తిగా రుజువయింది.

రవివర్మ యుద్ధ ప్రవృత్తి మానేశాడు. ఆయన తన ఒక్క కుమార్తెను విజయుడికిచ్చి పెళ్ళి చేసి అతన్ని అల్లుణ్ణి చేసుకుని, జయసింహుణ్ణి తన రాజ్యానికి తీసుకుపోయి యువరాజును చేశాడు. రవివర్మ అనంతరం జయసింహుడు రాజయాడు. జయవిజయులకు మధ్య ఉండిన అన్నదమ్ముల సంబంధమే ఉభయ దేశాల మధ్యా చాలా కాలం నిలిచింది.





# కామయ్యగారి కార్తిక పురాణం

ఒక ఊళ్ళో కామయ్యా, కాంతమ్మా అనే బ్రాహ్మణ దంపతులు ఉండేవారు. పాపం వారు చాలా బీదవారు. ఒకపూట తింటే మరో పూట తినేవారు కాదు.

ఒక రోజున కాంతమ్మ తన భర్తతో, "ఎన్నాళ్ళు పస్తులుంటాం? మీరు యాయవారమైనా ఎత్తరాదా?" అన్నది.

"ఏమిటే నువ్వనేది? మాది ఎంత గౌరవమైన వంశం! చావనైనా చస్తాగాని యాయవార మెత్తుతానా?" అన్నాడు కామయ్య.

ఒకరోజు కాంతమ్మ గుళ్ళో పురాణం చదువుతుంటే వినటానికి వెళ్ళింది. అనేక మంది వచ్చి శ్రద్ధగా పురాణం విని, అంతా అయాక తమకు తోచినది పురాణం చదివిన బ్రాహ్మణుడి చేతిలో పెట్టి వెళ్ళారు.

కాంతమ్మ ఇంటికి వచ్చి, తాను చూసినది భర్తకు చెప్పి, "మీరు కూడా పురాణం చదవండి. నాలుగు డబ్బులు కళ్ళ చూడవచ్చు." అన్నది.

కామయ్యకు ఈ ఆలోచన బాగానే ఉన్నది. అయితే ఉన్న ఊళ్లో ఒక పురాణం జరుగుతూనే ఉన్నది. అందుచేత పక్క గ్రామానికి వెళ్ళి కామయ్య పురాణం చదవాలని నిర్ణయం జరిగింది. మర్నాడు ఉదయమే కాంతమ్మ రెండు మైళ్లు నడిచి పొరుగూరు వెళ్ళి, ఆ సాయంకాలం తన భర్త అక్కడ పురాణం చదువుతాడని చెప్పింది.

అది కార్తిక మాసం. అందుచేత కామయ్య కార్తికపురాణం తీసుకుని పొరుగూరు చేరి, అక్కడి గుడిలో చదవనారంభించాడు. ఊరిలోని పెద్దలూ, పిన్నలూ, చేరి శ్రద్ధగా పురాణం వింటున్నారు.

మధ్యలో, దొంగతనం మహాపాప మన్న విషయం వచ్చింది.

వెమ్మాని లక్ష్మి

"దొంగతనం చెయ్యటం మహాపాపం. అందులోనూ కార్తికమాసంలో దొంగతనం చేసినవాళ్ళు చెప్పరాని నరకయాతనలు పడతారు. తెలిసింది కాదూ?" అన్నాడు కామయ్య.

ఎవరూ మాట్లాడలేదు. శ్రోతలకు విషయం సరిగా బోధపడలేదనుకుని, తన ఎదురుగా ఉన్న రెడ్డినీ, ఆయన పక్కనే కూర్చుని ఉన్న కాపునూ చూపిస్తూ, "ఈయన ఆయనగారి దగ్గిర వెయ్యిరూపాయలు దొంగిలించాడనుకోండి." అన్నాడు.

ఈ మాట వినగానే రెడ్డి మండి పడ్డాడు. అతను గొప్ప ధనవంతుడు. "ఏమిటేమిటి? నేను దొంగతనం చేశానా? నువ్వు చూశావేం? ఇదిటయ్యా నువ్వు చెప్పే కార్తిక పురాణం? అది చాల్లే, ఇక వేంచెయ్యి!" అన్నాడు రెడ్డి లేస్తూ.

"ఆగండి, నా మాట పూర్తిగా వినండి," అని కామయ్య బతిమాలినా లాభం లేక పోయింది. "మళ్ళీ ఈ వూళ్ళో అడుగు పెట్టేవు!" అంటూ రెడ్డి వెళ్ళిపోయాడు. అంతా లేచి పోయారు.

మర్నాడు కాంతమ్మ మరొక పొరుగూరు వెళ్ళి, అక్కడ తన భర్త ఆ సాయంకాలం పురాణం చెబుతాడని చెప్పి వచ్చింది. పురాణం వినటానికి చాలామంది వచ్చారు.



ఆవాళ తన భర్త వెంట కాంతమ్మ కూడా వచ్చింది.

పురాణం చదువుతున్న కామయ్య, "భక్తులారా, కార్తికమాసం పుణ్యకాలం. ఈ పుణ్యకాలంలో ఒక రూపాయి దానమిస్తే పది కాసులు దానమిచ్చినంత పుణ్యం వస్తుంది," అని, ఆ మాట స్పష్టం చెయ్యటానికి తన భార్యనూ, ఆమె పక్కనే కూర్చున్న మరొక స్త్రీనీ చూపించి, "ఈమె ఆమెగారికి ఒక రూపాయి దానం చేసిందనుకోండి," అన్నాడు.

వెంటనే ఆ రెండో ఆమె ఆగ్రహించి, "నేను దానాలు తీసుకుంటానా? నాకేం కర్మ పట్టింది? అందులోనూ బ్రాహ్మల సొమ్ము తిని పాపాన పొమ్మంటావా? చాల్లే నీ పురాణం!" అంటూ కాంతమ్మ పక్కనుంచి లేచి వెళ్ళిపోయింది. ఆమె ఆ ఊరి మునసబు భార్య కావటంచేత, ఆమె లేవగానే అందరూ లేచి వెళ్ళిపోయారు.

మూడోనాడు కామయ్యా, కాంతమ్మా మరో గ్రామానికి వెళ్ళి, అక్కడి గుళ్ళో చేరారు. కామయ్య కాంతమ్మకు పురాణం చదివి చెప్పసాగారు. క్రమంగా దారే వెళ్ళే జనం ఆగి పురాణం వినసాగారు.

మధ్యలో కామయ్య, "బ్రహ్మహత్య మహా పాతకం. అందులోనూ ఈ కార్తిక మాసంలో బ్రహ్మహత్య చేసినవాడు రౌరవ నరకానికి పోతాడు," అని తన ఎదురుగా కూర్చున్న ఒక బ్రాహ్మణ్ణి చూపిస్తూ, "నేను ఈయనను చంపి పారేశా ననుకోండి," అన్నాడు.

"ఏమిటీ, నన్ను చంపుతావా? ఏదీ చంపు?" అంటూ ఆ బ్రాహ్మడు లేచి కామయ్యను రెండు తన్నులు తన్నాడు. పురాణపఠనం మళ్ళీ అభాసయింది. పైసలు రాకపోగా కామయ్య ఒళ్లు హూనమయింది. అందుచేత కామయ్య మరెన్నడూ పురాణం చదవలేదు





# సింద్‌బాద్ అద్భుతయాత్రలు

సింద్‌బాద్ ఒకనాటి సాయంకాలం చల్ల గాలికి తన ఇంటిముందు కూర్చుని ఉండగా వీధి వెంబడి కొందరు వర్తకులు పోతూ కనిపించారు. వారు దూరదేశాల నుంచి తిరిగి వస్తున్నట్టు సింద్‌బాద్ గ్రహించ గలిగాడు. ఎందుకంటే, చాలా కాలం గడిచాక స్వదేశానికి తిరిగి రావటంచేత వారి ముఖాలలో ఆనందం తాండవిస్తున్నది. ఆ ఆనందం దేశంలోనే ఉండిపోయిన వాడికి అర్థంకాదు.

ఇది చూసినాక సింద్‌బాద్ మనసు మరొకసారి విదేశవ్యాపారం మీదికి మళ్ళింది. వెంటనే అతను వ్యాపార సరుకులు కొని వాటితో బస్రా చేరాడు. అక్కడ ఒక ఓడ సముద్రయానానికి సిద్ధంగా ఉన్నది. అందులో అనేకమంది వర్తకులూ, రాజప్రయాణికులూ ఉన్నారు. సింద్‌బాద్ తన సరుకులను ఆ ఓడ కెక్కించి, అందులో ప్రయాణమైనాడు.

ఓడ ఒక నగరం నుంచి మరొక నగరానికీ, ఒక దేశం నుంచి మరొక దేశానికీ ప్రయాణం చేసింది. ప్రతిచోటా క్రయ విక్రయాలు జరిగాయి. దారిలో అనేక వింతలు తెలిశాయి. ఒకనాడు ప్రయాణికులందరూ ఓడ పైభాగాన విశ్రాంతి తీసుకుంటూ ఉండగా ఓడ సరంగు పెద్ద పెట్టున అరిచి, తలగుడ్డ కిందకొట్టి గడ్డం పీక్కోసాగాడు.

అందరూ అతని చుట్టూ మూగి అతని విచారానికి కారణం అడిగారు.

"మనం దారి తప్పాం. ఇది తెలియని సముద్రం. ఇక మనను అల్లా రక్షించవలిసిందే. అందరూ అల్లాను ప్రార్థించండి," అన్నాడు సరంగు.

అతను అలా అంటూండగానే ఒక భయంకరమైన గాలి ప్రారంభమయింది. దాని దెబ్బకు ఓడ చుక్కాని కాస్తా విరిగి



పోయింది. ఓడ నావికుల వశం తప్పి, గాలికి కొట్టుకుపోసాగింది. ప్రయాణీకులు హాహాకారాలు చేశారు. త్వరలోనే ఓడ ఒక కొండకు కొట్టుకుని తునాతునకలైపోయింది. కొందరు ప్రయాణీకులు సముద్రం పాలయారు. సిందబాద్ మరికొందరితోబాటు నీటిలో ఈదుకుంటూ నీటి మధ్య ఉండే రాళ్ళగుట్టను చేరి, ప్రాణాలు దక్కించుకోగలిగారు.

సముద్రంలోకి చొచ్చుకువచ్చిన ఆ కొండ ఒక దీవిలో ఉన్నది. అక్కడ ఎన్నో ఓడలు పగిలిపోయాయి. వాటి శిథిలాలూ, వాటి తాలూకు సరుకుల బేళ్ళూ తీరమంతటా చెల్లాచెదరుగా పడి ఉన్నాయి. కొన్ని బేళ్ళు పగిలి వాటి నుంచి విలువైన వస్తువులు బయటికి వచ్చి ఉన్నాయి.

చావగా మిగిలినవాళ్ళు తీరం చేరుకున్నారు. సిందబాద్ ద్వీపంలోకి నడిచిపోయి ఒక కొండవాగు చేరుకున్నారు. ఆ వాగు కొండ నుంచి బయలుదేరి, లంక మీద కొంతదూరం ప్రవహించి, ఒక గుహలోకి అదృశ్యమయింది. ఆ వాగుకు రెండు పక్కలా, నీటి అడుగునా కూడా మాణిక్యపు రాళ్ళూ, వెండి, బంగారు కణికలూ ఉండి ధగధగా మెరుస్తున్నాయి. అక్కడ పడి ఉన్న సంపదను ఏ మనిషీ ఎక్కడా చూసి ఉండరు. వాగు వెంట ముసాంబరం చెట్లున్నాయి.

ఈ దీవి మీద సిందబాద్‌కు మరొక అద్భుతం కనబడింది. కొండ మీద అంతులేని అంబరు ఉన్నది. ఎండవేడికి కరిగి అది ప్రవాహం కట్టి, సముద్రజలంలోకి కారులాగా ప్రవహిస్తున్నది. ఆ అంబరును చేపలు తాగి, జీర్ణం చేసుకోలేక వాంతి చేసుకోగా, అది గట్టిపడి తృణమణి అయి, నీటి మీద తేలి ఒడ్డుకు కొట్టుకువస్తున్నది.

ఇక్కడ ఇంత సంపద ఉండి కూడా మనిషికి లభ్యం కాదు. ఎందుకంటే

ఈ ప్రాంతానికి వచ్చిన ఓడ విధిగా పగిలి పోతుంది. అందుచేత సింద్‌బాద్ మొద లైనవారు అంత సంపద మధ్యా ఆకలితో అలమటించవలసి వచ్చింది. అందరి దగ్గిరా ఉన్న కొద్ది ఆహారాన్ని అందరూ సమంగా పంచుకున్నారు. కాని అది ఎంత కాలం వస్తుంది? సింద్‌బాద్ ఉపవాసాలకు బాగా అలవాటైనవాడు కావటంచేత తన వంతు ఆహారాన్ని కొంచెం కొంచెమే తింటూ ఎలాగో ప్రాణాలు కాపాడుకున్నాడు. మిగి లినవాళ్ళు తమ వంతు ఆహారాన్ని త్వరగా పూర్తి చేసి, ఒక్కొక్కరుగా ఆకలికి చావ సాగారు. చచ్చినవాళ్ళను బతికి ఉన్న వాళ్ళు సముద్రతీరాన పూడ్చేస్తూ వచ్చారు. కొంతకాలానికి ఆఖరువాణ్ణి పూడ్చేసి, లంక మీద సింద్‌బాద్ ఒక్కడే మిగిలాడు.

ఎంత పొదుపుగా తిన్నా అతని ఆహారం అయిపోయింది. ఆకలిరాకసి అతన్ని పట్టే సింది. ఆఖరు క్షణం వచ్చినప్పుడు పడు కునే ఉద్దేశంతో అతను ఒక గొయ్యి తవ్వు కుని, తన శవం మీద ఇసకపోసే భారం గాలికి వదిలేశాడు.

తన భవిష్యత్తు తలుచుకుంటే అతనికి దుఃఖం వచ్చింది. అయిదుసార్లు వెళ్ళుక వానిలో చావు తప్పినా తనకు ఎందుకు బుద్ధి రాలేదు? దాలిగుంటలో కుక్క





లాగా తాను నేర్చుకున్న గుణపాఠం పదే పదే ఎందుకు మరిచిపోవాలి? డబ్బు కోసం ఇంత గడ్డి తినాలా? ఎన్ని తరాలకైనా సరి పడిన సంపద తనకున్నదే!

ఇంత విచారంలోనూ అతని బుద్ధి వేరే ఆలోచన చేస్తున్నది: ఆ గుహలోకి పోయిన వాగు ఏమైనట్టు? అది మరొక్కచోట బయటికి రావద్దా? అది ఎక్కడికి పోతున్నది? ఇక్కడ తిండికి మాడి చచ్చేకన్న ఆ వాగు ఎటు పోతున్నదో తెలుసుకోవటం ఫలం పాటు కాదా?

ఈ ఆలోచన కలగగానే సింద్‌బాద్‌లో కొంత కొత్త శక్తి వచ్చింది. అతను ముసాంబరం చెట్లకున్న పెద్ద పెద్ద కొమ్మలు విరిచి, వాటిని ఒక తెప్పలాగా తయారు చేసి, దాని మీద పగిలిన ఓడల చెక్కలు కొన్ని పరిచి, కొన్ని పెద్ద పెద్ద రత్నాలూ, తృణమణులూ ఏరి తెప్ప మీద పెద్ద కుప్ప పోసి, తెప్ప మీద ఎక్కి, రెండు కర్రలను తెడ్లుగా ఉపయోగిస్తూ, వేగంగా ప్రవహించే వాగు వెంట బయలుదేరాడు.

వాగు గుహలో దూరిన చోట తెప్ప కూడా దూరింది. గుహ లోపల కటిక చీకటి. వాగు ఎన్ని మెలికలు తిరిగితే తెప్ప కూడా అన్ని మెలికలూ తిరిగింది. మెలిక వచ్చిన చోట అది, అటూ ఇటూ ఉన్న కొండను కొట్టుకున్నది. అక్కడక్కడా సింద్‌బాద్ తల, మీద నున్న రాతికి తగులుతున్నది. గాఢాంధకారం కావటంచేత చూసి తలవంచే అవకాశం లేదు. పోనుపోను పల్లంలాగున్నది; ప్రవాహ వేగం హెచ్చింది.

సింద్‌బాద్‌కు ఈ వాగులో చచ్చే కన్న అదు బయట తిండికి మాడి చస్తేనే బాగుండేదనిపించింది. చేసేదేమీ లేక అతను తెప్పను కరుచుకుని బోర్లాపడుకుని, ఒళ్ళు తెలియని నిద్రలో పడిపోయాడు.

తాను ఎంతసేపు స్పృహ తప్పి ఉన్నదీ సింద్‌బాద్ ఎరగడు. అతనికి తిరిగి తెలివి

వచ్చేసరికి అత నొక పచ్చిక మైదానంలో పడుకుని ఉన్నాడు. పైన ఎండ కాస్తున్నది. అతని తెప్ప ఒక నది ఒడ్డున కట్టిపెట్టి ఉన్నది. అతని చుట్టూ జనం మూగి ఉన్నారు. వాళ్ళు ఇతియోపియనులు.

సింద్‌బాద్ కళ్ళు తెరవగానే వాళ్ళు మాట్లాడ నారంభించారు. కాని వాళ్ళ భాష అతనికి అర్థం కాలేదు. అయితే వారిలో ఒకడు ముందుకు వచ్చి, అరబ్బీ భాషలో, "మీ రెవరు? ఎక్కడి నుంచి వచ్చారు? మా దేశానికి ఏం పని మీద వచ్చారు? మేము రైతులం; మా పొలాలకు నీరు పెట్టుకుంటూ, మీరు నది వెంబడి రావటం చూసి, తెప్పను ఆపి, నది ఒడ్డున కట్టేసి, మిమ్మల్ని తెచ్చి అక్కడ పడుకోబెట్టాం," అన్నారు.

"కాస్త తిండి పెట్టండి, అంతా చెబుతాను," అన్నాడు సింద్‌బాద్.

వెంటనే వాళ్ళు అతనికి భోజనం పెట్టారు. అతనికి ప్రాణాలు తిరిగి వచ్చాయి. అతను వాళ్ళకు తన కథ అంతా చెప్పాడు. అతని కథను అరబ్బీ భాష వచ్చినవాడే మిగిలిన వాళ్ళకు అనువదించి చెప్పాడు. వాళ్ళు ఆశ్చర్యంగా తమలో తాము మాట్లాడు కున్నారు. వాళ్ళు అతన్ని తమ రాజు దగ్గిరికి తీసుకుపోయి, ఆయనకు అతని కథ





వినిపించాలని నిశ్చయించారు. అందుకు సిండ్‌బాద్ ఒప్పుకున్నాడు. వాళ్ళు అతన్ని, అతని తెప్పనూ, అతను ఏరుకు వచ్చిన రత్నరాశినీ మోస్తూ రాజు వద్దకు వెళ్ళారు.

వాళ్ళ రాజు సిండ్‌బాద్‌ను చాలా ఆదరించి, అతని కథ అంతా విని, ప్రాణాలు దక్కినందుకు అభినందించాడు. అతను తెచ్చిన రత్నాలూ, తృణమణులూ చూసి ఆయన మెచ్చుకున్నాడు. ఆయన రత్న నిపుణుడు. సిండ్‌బాద్ ఆయనకు రకానికి ఒక మణి చొప్పున ఎంచి బహూకరించాడు. రాజు అతన్ని తన అతిథిగా ఉంచుకుని, చాలా మర్యాద చేశాడు.

రాజు వద్ద కొలువుండేవాళ్ళు బాగ్దాదు గురించీ, ఖలీఫా గురించీ, ఆయన పరిపాలన గురించీ అనేక ప్రశ్నలు వేశారు. అతని సమాధానాలన్నీ విని రాజు, "మీ ఖలీఫా హారూనల్ రషీద్‌గారు చాలా యోగ్యుడిలా కనిపిస్తారు. ఆయన పట్ల నా స్నేహభావాన్ని ప్రకటించడానికి నీ ద్వారా బహుమతులు పంపుదామనుకుంటున్నాను," అన్నాడు.

"అలాగే చెయ్యండి. నేను మీ బహుమానాలను వారికి అందజేసి, తమరు చాలా యోగ్యులనీ, స్నేహపాత్రులనీ వారికి విన్నవిస్తాను," అన్నాడు సిండ్‌బాద్.

వెంటనే రాజు ఖలీఫా కోసం పంపే బహుమతులన్నీ తెప్పించాడు. వాటిలో ఒక కూజా ఉన్నది. అది వేలిమందమూ, ఆరంగుళాల ఎత్తూ ఉన్నది. దానిని కెంపు రాయిలో మలిచారు. ఆ కూజా నిండా ముత్యాలున్నాయి. అవి పోకకాయల ప్రమాణంలో ఉన్నాయి. బహుమతులలో ఒక పెద్ద తివాసీ ఉన్నది. దానిని అచ్చంగా పాముచర్మంతో తయారుచేశారు. దాని మీద రోగులు పడుకుంటే వారికి ఆరోగ్యం కలుగుతుందట. మిగిలిన బహుమతులలో రెండు వందల కర్పూరపు ఉండలూ, చాలా

పెద్ద ఐరావత దంతాలలా ఉన్నాయి. ఆపాదమస్తకమూ ఆభరణాలు దిగవేసిన దాసీది కూడా ఖలీఫాకు బహుమతిగా పంపబడుతున్నది.

రాజు ఖలీఫాకు తాను రాసిన ఉత్తరం సింద్‌బాదుకు ఇస్తూ, "ఈ స్వల్ప బహుమతులు పంపుతున్నందుకు మీ ఖలీఫా గారికి నా క్షమాపణలు చెప్పు. వీటి కన్న విలువైనది నాకు వారి పట్ల గల స్నేహభావం... కాని, సింద్‌బాద్, నువ్విక్కడ ఉండిపోతే నే నింకా సంతోషిస్తాను. నీకు ఏ లోపమూ జరగకుండా నేను చూస్తాను. ఖలీఫాగారికి ఈ బహుమానాలు మరెవరైనా తీసుకుపోతారు. ఉండిపోతావేమిటి? చెప్పు!" అన్నాడు.

సింద్‌బాద్ రాజుకు క్షమాపణ చెప్పుకున్నాడు. త్వరలోనే బస్రాకు ఓడ బయలు దేరుతున్నదని, తన దేశాన్ని, తన వారిని చూడాలని తాను తహతహలాడిపోతున్నానని అతను రాజుతో అని, వెళ్ళిపోవటానికి ఆయన అనుమతి వేడాడు.

సింద్‌బాద్‌ను బలవంతాన ఉంచేద్దామనే ఉద్దేశం రాజుకు ఏ కోశానా లేదు. ఆయన ఓడ సరంగునూ, అందులో ప్రయాణం చేస్తున్న వర్తకులనూ పిలిపించి, వారందరికీ సింద్‌బాద్‌ను పరిచయం



చేసి, అతనిని జాగ్రత్తగా చూసుకోమని వెయ్యి హెచ్చరికలు చేసి, అతని ఓడరేవు తానే ఇచ్చి, అతనికి తన తరఫున అంతు లేని కానుక లిచ్చాడు.

సింద్‌బాద్ రాజుగారికి తన కృతజ్ఞత తెలుపుకుని, అందరి వద్దా సెలవు పుచ్చుకుని ఓడ యెక్కాడు. దారిలో ఎలాటి అవాంతరాలూ జరగకుండా అతను బస్రా చేరి, అక్కడి నుంచి బాగ్దాదు చేరుకున్నాడు. అతను బాగ్దాదు రేవులో దిగుతూనే తిన్నగా రాజభవనానికి వెళ్ళి ఖలీఫా దర్శనం చేసుకుని, ఆయనకు ఇతియోపియా రాజుగారి ఉత్తరం అందించాడు.

ఖలీఫా ఆ ఉత్తరం చదువుకుని, సింద్‌బాద్ తెచ్చిన బహుమతులు పరీక్షించి, "ఇటివి పంపటానికి ఆ రాజు అపార సంపదగలవాడై ఉండాలి. అతను నిజంగా అంత సంపన్నుడేనా?" అని సింద్‌బాద్‌ను అడిగాడు.

"ప్రభూ, అందుకు సందేహం లేదు. ఆయన సంపన్నుడే కాదు న్యాయశీలుడు. దక్షత గల పాలకుడు. ఆయన పాలనలో ప్రజలు ఎంత సుఖపడుతున్నారంటే, వారికీ రాజుకూ మధ్య ఎలాటి ఘర్షణా తల ఎత్తదు. అంతేకాక ఆయన చాలా స్నేహపాత్రుడూ, విశ్వసనీయుడూనూ," అని సింద్‌బాద్ ఖలీఫాకు చెప్పాడు.

ఖలీఫా సింద్‌బాద్‌కు అనేక బహుమానాలు ఇచ్చి సత్కరించాడు. ఆయన ఆస్థాన లేఖకులను పిలిపించి, సింద్‌బాద్ అనుభవాలన్నీ లిఖితం చేయించి, అతని కథ యావత్తూ ఇతిహాస పత్రాలలో చేర్చవలసిందిగా ఉత్తరు విచ్చాడు.

సింద్‌బాద్ ఖలీఫా వద్ద సెలవు పుచ్చుకుని, తన ఇంటికి చేరుకుని, తనవారి నందరినీ తిరిగి కలుసుకుని, గౌరవమర్యాదలూ, భోగభాగ్యాలూ అనుభవిస్తూ, ఏ లోటూ లేకుండా సుఖజీవనం వెళ్ళబుచ్చాడు.





# ఉరిశిక్ష

నాగాదిత్య మహారాజు పరాక్రమ సంపన్నుడు. ఆయన రాజ్యం సుభిక్షం, ఆయన సైన్యం అపారం. ఆయన అంటే పరిసర రాజ్యాలవారికి సింహస్వప్నం. ఆయనకు లేకలేక కలిగిన కుమారుడు దేవాదిత్యుడు. ఆ కుర్రవాడంటే ప్రభువుకూ, ప్రజలకూ కూడా ఎంతో ప్రేమ.

నాగాదిత్యుడు రాజ్యం వెలుపల ఒక భీకరారణ్యం ఉండేది. దాన్ని అందరూ ఢాకినీవనం అని పిలిచేవాళ్ళు. అందులోకి ఎవరూ ప్రవేశించేవారు కారు. అయితే శౌర్యధనుడైన నాగాదిత్యుడు ఢాకినీవనంలో వేటాడ నిశ్చయించి, సపరివారంగా బయలుదేరాడు. మంత్రిసామంతులు వద్దని చెప్పినా, ప్రయోజనం లేకపోయింది.

తీరా వెళ్లిచూస్తే ఢాకినీవనం ఎంత మాత్రమూ భయంకరంగా కనబడలేదు, మిదుమిక్కిలి ఆహ్లాదకరంగా ఉన్నది. చెట్ల మీద రకరకాల పక్షులు శ్రావ్యంగా గానం చేస్తున్నాయి. అలాటి వనం గుండా వెళ్ళి రాజు ఒక కోనేటిని చేరుకున్నాడు. ఆ కోనేటి జలం అతి నిర్మలంగా ఉన్నది. కోనేటిలో హంసలు విహరిస్తున్నాయి. రాజు ఆ కోనేటి గట్టున సపరివారంగా విడిసి, కొంతసేపు విశ్రాంతి తీసుకుని, ధనుర్బాణాలు చేతబట్టి, వేటకై ఒంటరిగా వనంలోకి బయలుదేరాడు.

ఆయన కొంతదూరం వెళ్ళేసరికి ఒక తెల్లని కుందేలు కనబడింది. వెంటనే ఆయన దానిపైకి బాణం వదిలాడు. మరుక్షణమే కుందేలు మాయమై ఒక అద్వితీయ సౌందర్యవతి ప్రత్యక్షమయింది. రాజు విడిచిన బాణం పుష్పమాలగా మారి ఆమె మెడలో పడింది.

"మహారాజా, వరమాల వేసి సత్కరించి నన్ను ధన్యురాలిని చేశారు. నేటి నుంచి నేను మీ పత్నిని," అన్నదామె.

పి. సి. సర్కార్, ఇంద్రజాలికుడు



ఆమె సౌందర్యంతోనే సమ్మోహితుడైన నాగాదిత్యుడు ఈ మాటలు విని పూర్తిగా మతిభ్రమణం చెందాడు. ఆయన ఆమెను వెంటబెట్టుకుని కొలనుకు తిరిగి వచ్చి తన పరివారులతో, "మీరు ముందుగా నగరానికి వెళ్ళి నా వివాహోత్సవానికి ఏర్పాట్లు చేయించండి," అన్నాడు.

ఇప్పుడాయనకు తన రెండవ భార్యతోటిదే లోకం. ఆయన ఇప్పుడు తన మొదటి భార్య గురించి గాని, తన కొడుకైన దేవాదిత్యుణ్ణి గురించి గాని స్పృహే లేదు. వారిని గురించి ఆలోచన కలిగినప్పుడు చీదరించుకునేవాడు. రాజుగారి కొత్త భార్య



పేరు సురసుందరి. అయితే నిజానికామె ఢాకినీవనం లోని ఢాకినీలకు రాణి. ఆమె తన జిత్తులతో రాజును తన చేతి కీలుబొమ్మను చేసి ఆడించసాగింది.

కాలక్రమాన సురసుందరికి కూడా ఒక కొడుకు జన్మించాడు. అది మొదలు ఆమె దేవాదిత్యుణ్ణి మరింతగా ద్వేషిస్తూ, అతని వినాశనానికి కంకణం కట్టుకున్నది. ఆమె రాజుతో, "నా ఆరోగ్యం క్రమంగా చెడిపోతున్నది. నీ కొడుకు దేవాదిత్యుడు ఈ రాజ్యంలో నుంచి పోతేనే గాని నా ఆరోగ్యం కుదుటపడదు," అన్నది. తన చిన్న భార్య వికారాన్ని ఏ మాత్రమూ భరించలేని రాజు వెంటనే దేవాదిత్యుడి దేశబహిష్కరణ ప్రకటించాడు. ఇది విని రాజుగారి పెద్ద భార్య రాజవతీదేవి వెళ్ళి తన భర్త పాదాలపై పడి ఏడ్చింది. రాజు ఆమెకు కూడా దేశబహిష్కరణ శిక్ష విధించి, ఆమెనూ, ఆమె కొడుకునూ దేశం వెడల నడిపించే పనిని తన సేనాపతి అయిన రుద్రకుడికి అప్పగించాడు.

రుద్రకుడు రాజవతీదేవికి, దేవాదిత్యుడికి సంకెళ్ళు తగిలించి తన వెంట తీసుకుపోయాడు. కాని అతను వారిని దేశం నుంచి సాగనంపటానికి మారుగా తన



ఇంటనే రహస్యంగా ఉంది, వారు దేశం విడిచి పోయినట్టు ప్రకటనచేశారు.

రాజుగారి ముఖ్యమంత్రి ధర్మప్రాణుడు రాజుగారి స్థితి చూసి ఆందోళన చెంది, సురసుందరిని కడతేర్చితేనే గాని పరిస్థితి చక్కబడదని నిశ్చయించుకున్నాడు. ఆమెకు అంతఃపుర దాసి ద్వారా ఆయన విషం పెట్టించాడు. కాని సురసుందరిని విషం ఏమీ చేయలేకపోయింది. ఆమె ఆ విషాన్ని సులువుగా జీర్ణం చేసుకున్నది.

అది చూసి ధర్మప్రాణుడు మరింత ఆందోళనపడి, తన గురుపాదులను సలహా అడగటానికి బయలుదేరి వెళ్లాడు. ఆయన గురువు దూరాన గల ఒక కొండపై తపస్సు చేసుకుంటూ ఉండేవాడు. ధర్మప్రాణుడు వచ్చిన పని తెలుసుకుని ఆయన, సురసుందరి చావటానికి ఒకే మార్గం ఉన్నదని తెలిపాడు. అదేమిటంటే, ఢాకినీవనంలో ఒక పన్నెండు కొమ్మల మర్రిచెట్టున్నది; దాని కొమ్మలు చీలేచోట ఒకతొర్ర ఉన్నది; ఆ తొర్రలో ఒక వెండి దబ్బనం ఉన్నది; దానితో ఎవరైనా సురసుందరి కుడికాలి బొటనవేలిని పొడిస్తే ఆమె మరణిస్తుంది.

ఢాకినీవనం లోకి వెళ్ళేసాహసి దొరకాలి గాని మిగిలినది ఏమంత కష్టం కాదు. ధర్మప్రాణుడు సేనాపతిని కదిలించ





చూశాడు. సేనాపతికి కూడా సురసుందరి పీడ త్వరగా విరగడ కావాలనే ఉన్నట్టు స్పష్టమయింది.

"ధాకినీవనం ప్రవేశించగల ధీరుడు నీ ఎరుకలో ఎవరైనా ఉన్నట్టయితే సురసుందరిని కడతేర్చటం ఏమీ కష్టం కాదు," అంటూ మంత్రి అంతా సేనాపతికి చెప్పేశాడు.

"అలాటి ధీరుడు దొరకక పోడు. నాకు కొంచెం వ్యవధి ఇవ్వండి." అన్నాడు రుద్రకసేనాపతి.

ఆ రాత్రే అతను వెండి దబ్బనం గురించి, తన ఇంట రహస్యంగా ఉన్న దేవాదిత్యుడితో చెప్పాడు. దేవాదిత్యుడు నిశి రాత్రివేళ ధాకినీవనానికి బయలుదేరి వెళ్ళాడు. అక్కడ పన్నెండు కొమ్మల మర్రిచెట్టు కనబడింది. దాని తొర్రలో వెండి దబ్బనం దొరికింది.

దేవాదిత్యుడు మర్నాడు పగలల్లా ఆ వనంలోనే గడిపి, చీకటి పడినాక రాజధానికి బయలుదేరాడు. అయితే దురదృష్టవశాన, అతను సేనాపతి ఇంటిని చేరబోతుండగా కొందరు రాజభటులు అతన్ని గుర్తించి పట్టుకుని, బహుమతి లభిస్తుందన్న ఆశతో సురసుందరి వద్దకు తీసుకుపోయారు. వారి ఆశ ఫలించింది. ఆమె వారు ఊహించిన దానికన్న హెచ్చుగానే వారిని బహూకరించింది. ఆ రాత్రి దేవాదిత్యుణ్ణి రాజసౌధంలోనే బందీగా ఉంచి, దేశ బహిష్కరణను ఉల్లంఘించినందుకు అతనికి మరణ దండన విధించేలాగు రాజును ఒప్పించింది.

మర్నాడు ఉదయమే రాజు దేవాదిత్యుడికి మరణశిక్ష విధించాడు. మధ్యాహ్నం పన్నెండు గంటల వేళ ఉరిశిక్ష అమలు జరుగుతుంది.

మంత్రికి మరొక పెద్ద సమస్య వచ్చిపడింది. ఆయన సేనాపతి రుద్రకుడితో సంప్రతించాడు.

"మీరేమీ విచారించకండి. నా స్నేహితుడైన మాయాధరుడు నా కొక చిన్న ఉపాయం చెప్పాడు. ఆ ఉపాయంతో మన కష్టాలన్నీ గట్టెక్కవచ్చు." అన్నాడు సేనాపతి.

ఆ మాటలలో మంత్రికి ఆట గురికుదుర లేదు. దానికి తగినట్టుగానే సేనాపతి సురసుందరి వద్దకు వెళ్ళి, "మహారాణీ, దేవాదిత్యుడి ఉరిశిక్షను నేను స్వయంగా జరిపించబోతున్నాను. తమరు కూడా అక్కడికి వచ్చి తమ శత్రువువధ కళ్ళారా చూడాలని నా ప్రార్థన," అన్నాడు.

ఇందుకు సురసుందరి సంతోషంగా ఒప్పుకున్నది. మిట్టమధ్యాహ్నంవేళకు వధ్య స్థానానికి దేవాదిత్యుణ్ణి తెచ్చారు. రుద్రకుడు ఒక తాడు తెచ్చాడు. దేవాదిత్యుణ్ణి ఒక గోడకు వీపు పెట్టి నిలబెట్టారు. రుద్రకుడు మోకు యొక్క మధ్యభాగాన్ని దేవాదిత్యుడి మెడకు మెలిక వేసి, మోకు చివరలు ఇద్దరు బలాఢ్యుల కిచ్చి, "నేను చెప్పినప్పుడు మోకును బలంగా లాగండి," అని ఆజ్ఞాపించాడు.

తన శత్రువైన దేవాదిత్యుడి ఉరిశిక్షను చూడ వచ్చిన సురసుందరి అప్పుడు శిక్షితుడికి ఎదురుగానే వచ్చి నిలబడింది.

"లాగండి!" అని గట్టిగా అరిచాడు సేనాపతి.



ఇద్దరు జల్లాదులూ బలంకొద్దీ మోకు చివరలను పట్టి లాగారు. ఉచ్చు దేవాదిత్యుడి మెడకు బిగుసుకోవటానికి మారుగా ఊడి వచ్చేసింది! దేవాదిత్యుడు ముందరికి పడిపోయినట్టు నటించి, తన వద్ద ఉన్న దబ్బనంతో సురసుందరి కుడికాలి బొటన వేలిని ఒక్క పోటు పొడిచాడు. మరుక్షణమే ఆమె కెవ్వున అరిచి ప్రాణం వదిలింది. అదే క్షణంలో అంతఃపురంలోని ఆమె కొడుకు కూడా మరణించాడు. వారిద్దరూ చావగానే రాజుకు ఏదో మైకం వదిలి నట్టయింది. అతను తన మొదటి భార్య కోసమూ, దేవాదిత్యుడి కోసమూ వెదక నారంభించాడు. త్వరలోనే వారిద్దరూ ఆయనను చేరుకున్నారు. తరవాత అంతా సుఖంగా ఉన్నారు.

* * *

లాగితే బిగుసుకోవలసిన ఉచ్చు ఎలా ఊడి వచ్చింది? అలా జరగటానికి మాయాధరుడు చేసిన ట్రిక్కు ఏమిటి? అతను ఏడేసి అడుగుల నిడివి గల రెండు తాళ్లు తీసుకున్నాడు. అతను తాళ్ళను నేల మీద పక్క పక్కనే పరిచి, తాళ్లరంగే గల సన్నని దారంతో కలిపి కట్టాడు. తాడును మెడకు చుట్టేటప్పుడు వాటిని మెలి పెట్టి, దేవాదిత్యుడి మెడ వెనక రెండు చుట్లు ఏర్పడేటట్టుగా ఉచ్చు అమర్చాడు. (కింది బొమ్మ చూడండి.) ఈ ఉచ్చులను కలిపి ఉంచే సన్న దారపు ముక్కే. దేవాదిత్యుడి వెనక గోడ ఉన్నది గనక అవి ఎవరికీ కనబడవు. దేవాదిత్యుడి మెడ ముందు భాగంలో ఉచ్చు ముడి వేశారు. తాళ్ళ చివరలను పట్టిలాగగానే, దేవాదిత్యుడి మెడ వెనక ఉన్న రెండు చుట్లనూ కలిపి ఉంచిన దారపు పోగు కాస్తా తెగిపోయి, మెడకున్న ఉచ్చు బిగవటం జరగ లేదు. కింది బొమ్మ ఆధారంతో ఎవరైనా ప్రయత్నించి ఈ ట్రిక్కు చేయవచ్చు.





# తండ్రికి తగిన కొడుకు

ఒక గ్రామంలో ఒక గజదొంగ ఉండేవాడు. అతని పేరు చెంగన్న. అతనికి మల్లన్న అని పదేళ్ళ కొడుకు ఉండేవాడు. మల్లన్న కూడా తనలాగే చోరవిద్యలో ఆరితేరి, తన అనంతరం జీవిత యాత్ర సాగించాలని చెంగన్న ఉద్దేశం. కాని అతనికి దీర్ఘ వ్యాధి పట్టుకుని, ప్రాణం తీసేటట్టు కనిపించింది.

చెంగన్న మల్లన్నను పిలిచి "నాయనా, నువ్వు మరీ పసివాడివి. మన వృత్తిలో ఎన్నో మెళుకువలు నీకు నేర్పుదామనుకున్నాను. నీకు నేర్చుకునే వయసూ, నాకు నేర్పే అవకాశమూ లేకుండానే ఈ మాయదారి రోగం దాపరించింది. ఇది నన్ను పొట్టన పెట్టుకుంటే నువ్వు ఎట్లా బతుకుతావు? నువ్వు ఈ వృత్తి ఎవరి దగ్గిర నేర్చుకుంటావు?" అన్నాడు.

"నువ్వేమీ బెంగ పెట్టుకోకు, నాన్నా. నీ కొడుకునై ఉండి, నీ పరువు కాపాడలేకపోతానా? నేను కూడా నీ అంత దొంగనని రుజువు చేస్తాను," అన్నాడు మల్లన్న.

అయితే ఆ కుర్రకుంక మాటలతో తండ్రికి ఊరట కలగక పోగా, వాణ్ణి గురించి మరింత విచారం పట్టుకున్నది.

ఇలా ఉండగా ఒకనాడు కొంచెం పొద్దెక్కి మల్లన్న ఊరి చివర ఉన్న బావి దగ్గిరికి వెళ్ళి అక్కడ కూర్చున్నాడు. ఊళ్ళో ఉన్న స్త్రీలు బట్టలు ఉతుక్కుని, నీరు పట్టుకుపోయే వేళ దాటగానే ఆ ప్రదేశం నిర్జనమయింది.

ఆ సమయంలో మల్లన్న దూరాన ఒక పరదేశిని చూశాడు. అతను చాలా ఒడ్డూ, పొడుగూ ఉండి, బలిష్ఠంగా ఉన్నాడు. పెద్ద తలగుడ్డ చుట్టుకున్నాడు. అతని భుజాన చాలా మూటలున్నాయి. ఆ మనిషిని చూస్తూనే మల్లన్న దొంగ అని పసికట్టాడు. ఆ మనిషి కిందటి రాత్రి ఎక్కడో

ఎస్. ప్రదీపకుమార్

దొంగతనం చేసి, ఆ నరుకును మరెక్కడో అమ్ముకోవటానికి పోతున్నాడని మల్లన్న గ్రహించాడు.

వెంటనే మల్లన్నకు ఒక యుక్తి తట్టింది. వాడు సన్నగా ఏడుస్తూ బావిగట్టున కూర్చుని బావిలోకి తొంగి చూడసాగాడు. వచ్చే మనిషికి మల్లన్న చెవికి ఉన్న పోగు కనబడింది. చుట్టు పక్కల ఎవరూ లేరు. ఆ పోగులు కాజెయ్యటానికి మంచి అవకాశ మనుకుని ఆ మనిషి బావి దగ్గిరికి వచ్చాడు.

"ఏం అబ్బాయ్, ఎందుకేడుస్తున్నావ్?" అన్నాడా మనిషి.

మల్లన్న మరింత గట్టిగా ఏడుస్తూ, చేత్తో బావిలోకి చూపించి, "నా మెడలో ఉన్న బంగారు గొలుసు బావిలో పడింది. గొలుసు లేకుండా ఇంటికి పోతే మా అయ్య చంపేస్తాడు," అని వెక్కుతూ అన్నాడు.

"ఏడవకు! ఈ మిఠాయి తిను. నీ గొలుసు నేను తీసి పెడతాగా! కాస్త ఈ మూటలు చూస్తూ ఉండు!" అంటూ ఆ మనిషి మల్లన్నకు తన మూటలలో ఒక దాని మంచి తినుబండారం తీసి పెట్టి, మూటలు బావి పక్కన పెట్టి, బావిలోకి దిగాడు. వెంటనే మల్లన్న ఆ మూటలు రెండు చేతులా ఎత్తుకుని శీఘ్రంగా ఇంటిదారి పట్టాడు.

కొడుకు తెచ్చిన మూటలు చూసి మంచంలో కూర్చుని ఉన్న చెంగన్న, "ఎక్కడివిరా అవి?" అని అడిగాడు.

మల్లన్న జరిగినదంతా తండ్రికి చెప్పాడు.

మూటలు విప్పిచూస్తే వాటి నిండా వెండి వస్తువులూ, బంగారు నగలూ, డబ్బూ, విలువయిన బట్టలూ ఉన్నాయి. అది దొంగ సొమ్మనటానికి సందేహం కొంచెం కూడా లేకపోయింది.

చెంగన్న పరమానందంతో, "ఈ తెలివితో నన్ను మించావురా! ఇక నేను నీకు నేర్ప వలసింది ఏమీ లేదు," అన్నాడు.





# మహాభారతం

ద్రౌపదీస్వయంవరం గురించి విని అనేక దేశాల రాజులు కాంపిల్య నగరానికి వచ్చారు. వారికి వేరు వేరు ప్రదేశాలలో విడుదులు ఏర్పాటయాయి. పాండవులు ఒక కుమ్మరి ఇంట బసచేసి, మాధుకరం తెచ్చుకుని తింటూ వచ్చారు.

ద్రుపదుడు కూడా తన కుమార్తెను అర్జునుడికిచ్చి చెయ్యాలన్న కోరికను ఎవరికీ తెలుపక, ఎక్కుపెట్టటానికి అసాధ్యమైన విల్లొకటి ఏర్పాటుచేసి, ఆకాశంలో అమర్చిన మత్స్యయంత్రాన్ని ఆ వింటితో కొట్టినవాడికి తన కుమార్తె నిచ్చి పెళ్లి చేస్తానని చాటింపు వేశాడు.

ఈ చాటింపు విని కర్ణుడూ, ధృతరాష్ట్రుడి కొడుకులూ, ఇంకా అనేకమంది రాజులూ, స్వయంవర వేడుకలు చూసే ఉద్దేశంతో అనేకమంది ఋషులూ వచ్చి, ద్రుపదుడి స్వాగతమూ, ఆతిథ్యమూ స్వీకరించారు.

నగరానికి ఈశాన్యదిక్కుగా స్వయంవర మంటపం నిర్మించి, చక్కగా అలంకరించారు. అందరూ కూర్చోవటానికి వీలుగా మంచెలు అమర్చారు. అక్కడికి క్షత్రియులూ, బ్రాహ్మణులూ వచ్చి, తమకు అనువైన స్థానాలలో కూర్చున్నారు. బ్రాహ్మణులతో కలిసి కూర్చున్న పాండవులు ద్రుపదుడి వైభవాన్ని చూసి ఎంతో సంతోషించారు. అతిథులకు చాలారోజులపాటు నృత్యగాన వినోదాలతో కాలక్షేపం జరిగింది.

చివరి రోజున ద్రౌపది మంగళస్నానం చేసి, సర్వాభరణాలూ ధరించి, మంచి

## 14. ద్రౌపదీస్వయంవరం



బట్టలు కట్టుకుని, చేత బంగారుపుష్పాల మాల ధరించి స్వయంవర మంటపం మధ్యకు వచ్చింది. ద్రుపదుడి పురోహితుడైన సోమకుడు అంతకుముందే అగ్ని చుట్టూ దర్భలు పరిచి, అగ్నిహోత్రం చేసి ద్రౌపదిని దీవించాడు. ద్రౌపది రాగానే మంగళ వాద్యాలు మోగాయి.

అప్పుడు ధృష్టద్యుమ్నుడు మంటపం మధ్యకు వచ్చి, వాద్యాలను ఆపించి, చుట్టూ కూర్చుని ఉన్న రాజులకు వింటినీ, అయిదు బాణాలనూ, పైన అమర్చిన మత్స్యయంత్రాన్నీ చూపి, "ఈ అయిదు బాణాలనూ ఈ వింటికి ఎక్కుపెట్టి, ఆ మత్స్యయంత్రాన్ని కొట్టినవానిని మా చెల్లెలు పెళ్ళాడుతుంది. కనుక మీలో విలువిద్యా ప్రావీణ్యం గలవారు వచ్చి శక్తి కొద్దీ ప్రయత్నించండి," అన్నాడు. తరవాత అతను ద్రౌపదికి వేరువేరు రాజులను చూపి, వారి పేర్లు చెప్పి, పరిచయం చేశాడు. వారిలో దుర్యోధనాదులతో బాటు శల్యుడూ, విరాటుడూ, శకునీ, అశ్వత్థామా, అక్రూరుడూ, సాంబుడూ, ప్రద్యుమ్నుడూ, కృష్ణుడూ, కృతవర్మా, అనిరుద్ధుడూ, సుశర్మా, శిశుపాలుడూ, చిత్రాంగదుడూ, భగదత్తుడూ, పౌండ్రకవాసుదేవుడూ మొదలైన వారు అనేకులున్నారు.

మన్మథుడి అరవబాణం లాగా ఉన్న ద్రౌపదిని వచ్చినవారంతా తదేక దృష్టితో చూస్తూ ఉండిపోయారు. కృష్ణుడు బ్రాహ్మణుల మధ్యనున్న పాండవులను గుర్తించి బలరాముడికి చెప్పాడు.

మత్స్యయంత్రాన్ని కొట్టే ప్రయత్నం ఆరంభమయింది. ఒక్కొక్క రాజకుమారుడే వచ్చి, వింటిని ఎక్కుపెట్టటం కూడా సాధ్యం కాక, అవమానంతో అవతలికి వెళ్ళిపోసాగారు. అనేకమందికి శృంగభంగమయాక కర్ణుడు వచ్చి, విల్లు ఎక్కుపెట్టి, బాణాన్ని సంధించసాగాడు. ద్రౌపదిని నిశ్చ



యంగా అతనే గెల్చుకుంటాడని అందరూ అనుకున్నారు. క్షత్రియులు కర్ణుడి స్తోత్రాలు ఆరంభించారు. అది విని ద్రౌపది, "నేను సూతుడి కొడుకును వరించను," అని పెద్దగా, అందరికీ వినిపించేలాగా కేక పెట్టింది. కర్ణుడు కోపంతో పాటు నవ్వుతూ, సూర్యుడి కేసి చూసి, తిరిగి వెళ్ళాడు. కర్ణుడి తరవాత శిశుపాలుడూ, జరాసంధుడూ, శల్యుడూ వింటిని సంధించలేక విఫలులయారు.

ఇక రాజు లెవరూ ముందుకు రాలేదు. ప్రేక్షకులలో కలకలం సాగింది. ఆ సమయంలో బ్రాహ్మణుల మధ్యనుంచి అర్జునుడు లేచి వచ్చి, వింటిని సమీపించాడు. అది చూసి బ్రాహ్మణులు ఆశ్చర్యపోయి, "మహా పరాక్రమవంతులైన శల్యుడూ, జరాసంధుడూ, శిశుపాలుడూ లాటి వాళ్ళకే అలవిగాని విల్లును ఈ బ్రాహ్మణ కుమారుడు పట్టుకోబోతున్నాడు గదా. వీడు నిశ్చయంగా బ్రాహ్మణులకు అవమానం తెస్తాడు!" అని తమలో తాము అనుకున్నారు. కొందరు మాత్రం, "వీడికి బలం, అస్త్ర విద్యా నైపుణ్యం ఉంటే ఉంటుంది. లేకపోతే ఆ వింటి జోలికి ఎందుకు పోతాడు?" అనుకున్నారు.

అర్జునుడు వింటిని సమీపించి, సభకు నమస్కారం చేసి, వింటికి నమస్కరించి, తన గురువుకు ఆత్మనమస్కారం చేసి, కృష్ణుణ్ణి తలుచుకుని, తాము రోజూ వాడే వింటిని సంధించినంత సునాయాసంగా ఆ వింటికి అయిదు బాణాలూ సంధించి, మత్స్యయంత్రాన్ని ఒక్క దెబ్బతో కింద పడగొట్టాడు. అందరూ ఒక్క క్షణం దిగ్భ్రమ చెందారు. తరవాత హర్షనాదాలు మిన్ను ముట్టాయి. బ్రాహ్మణులు సంతోషంతో పై బట్టలు ఎగరవేశారు. ఆ క్షణంలోనే ధర్మరాజు నకులసహదేవులను తీసుకుని తమ విడిదికి వెళ్ళిపోయాడు. ద్రుపదుడు

మాత్రం సంతోషాశ్చర్యాలతో దూరం నుంచి అర్జునుణ్ణి చూస్తూ ఉండిపోయారు.

స్వయంవరానికి వచ్చిన రాజులకు గొప్ప అవమానం జరిగినట్టు తోచింది. "ఈ ద్రుపదుడు మనని చెట్టెక్కించి, పండు కోసుకునే లోపల కిందికి తోసేశాడు. తన కూతుర్ని ఒక్క రాజకుమారుడికీ ఇవ్వక బ్రాహ్మణుడికిస్తాడా? బ్రాహ్మణుల్లో ఎక్కడన్నా స్వయంవరం ఉన్నదా? ఈ పిల్ల బ్రాహ్మణుణ్ణి ఎలా చేసుకుంటుంది? ఇలాటి పని మరొకసారి జరగకుండా ఈ ద్రుపదుడి ప్రాణాలు తీయాలి! ఈ పిల్ల ఎవరో ఒక రాజకుమారుణ్ణి వరిస్తుందా సరేసరి, లేకపోతే దీన్ని నిప్పులోకి తొయ్యాలిసిందే. బ్రాహ్మణుడు గనక ఈ వటువును ప్రాణాలతో వదిలేద్దాం," అంటూ రాజులు కత్తులూ, కటార్లూ చేతబట్టి, ద్రుపదుణ్ణి చుట్టుముట్టారు. ద్రుపదుడు భయపడి బ్రాహ్మణుల మధ్యకు వెళ్ళాడు.

ద్రుపదుడి పై కత్తి కట్టిన రాజులకు భీమార్జునులు అడ్డు తగిలారు. రాజులు బాణాలు వెయ్యటం మొదలు పెడితే భీముడొక చెట్టు పెకలించి తెచ్చి, రాజుల బాణాలను దానితో అడ్డుతూ అర్జునుడి పక్కన నిలబడ్డాడు. బ్రాహ్మణులు ద్రుపదుణ్ణి



కాపాడటానికి రాజుల మీద రాళ్ళు విసర సాగారు. అర్జునుడు వారిని వారించి, మత్స్యయంత్రాన్ని కొట్టిన వింటితోనే రాజులను ఎదుర్కొన్నాడు. శల్యుడు, కర్ణుడు మొదలైనవారు అది చూసి, తమను ఎదిరించినవాడు బ్రాహ్మణుడే అయినా చంపదగిన వాడేనని నిశ్చయించారు. అర్జునుడు కర్ణుడికి ఎదురై యుద్ధం చేశాడు. అర్జునుడి ప్రతాపానికి ఆశ్చర్యపడి కర్ణుడు, "ఓ బ్రాహ్మణుడా, నీ అస్త్ర కౌశలానికి మెచ్చాను. నాతో సమంగా పోరాడగలవాడు అర్జునుడు తప్ప మరెవరూ లేరు. నువు నిజంగా ఎవరివో చెప్పు," అన్నాడు. కాని





అర్జునుడు తానెవరైనదీ బయట పెట్ట లేదు. బ్రహ్మతేజస్సు జయించరానిదను కుని కర్ణుడు యుద్ధం మానేశాడు.

ఈ లోపల శల్యుడికీ భీముడికీ యుద్ధం సాగుతున్నది. చివరకు భీముడు శల్యుణ్ణి పట్టి ఎత్తి, చంపే ఉద్దేశం లేక దూరంగా విసిరి వేశాడు. బ్రాహ్మణులందరూ గొల్లున నవ్వారు. మిగిలిన రాజకుమారులకు కాళ్ళా, చేతులా ఆడలేదు.

అయితే ఈ మహావీరులు మామూలు బ్రాహ్మణులు కారని అందరికీ స్పష్ట మయింది. వాళ్ళు ఎవరో తెలుసుకోవాలన్న ఆసక్తి కూడా జాస్తి అయింది. కృష్ణుడు కూడా రాజులతో, "ఈ బ్రాహ్మణులు న్యాయంగా ద్రౌపదిని గెలుచుకున్నారు. రాజులతో ధర్మయుద్ధం చేశారు. అందుచేత వారిపై కయ్యానికి కాలు దువ్వకండి," అన్నారు. అతని సలహా పాటించి రాజులు ఎవరిదారిన వారు వెళ్ళిపోయారు.

ఈ లోపల కుమ్మరి ఇంట బస చేసి ఉన్న కుంతి, తన కొడుకులు ఎంతకూ తిరిగి రాకపోయేసరికి, దుర్యోధనాదుల వల్ల వాళ్లకు ఏమికీడు మూడిందో అని భయపడింది. ఇంతలో నకులసహదేవులతో ధర్మరాజు వచ్చాడు. తరవాత కొంతసేపటికి భీమార్జునులు ద్రౌపదితో సహా వచ్చి చేరారు. వస్తూనే వాళ్లు, "అమ్మా, మేము భిక్ష తెచ్చాం," అన్నారు లోపల ఉన్న తమ తల్లితో. కుంతీదేవి, "అందరూ సమంగా పంచుకోండి, నాయనా!" అంటూ ఇవతలికి వచ్చి, దేదీప్యమానంగా వెలిగిపోతున్న ద్రౌపదిని చూసి బిత్తరపోయింది.

ఆమె ధర్మరాజుతో, "నాయనా, నా వల్ల పెద్ద పొరపాటు జరిగిపోయింది. భీమార్జునులు భిక్ష తెచ్చామంటే, అందరూ సమంగా పంచుకోమని అనేశాను. నే నెన్నడూ అసత్య మాడినదాన్ని కాను. ఈ కన్యను మీ రందరూ అనుభవిస్తే అది









అధర్మమవుతుంది; అనుభవించకపోతే నా మాట అబద్ధమవుతుంది. అందుచేత ధర్మమార్గం ఏదో ఆలోచించి ఆలా చెయ్యండి," అన్నది.

ధర్మరాజు కొంచెంసేపు ఆలోచించి, కుంతిని విచారించవద్దని, అర్జునుడితో, "అర్జునా, నువ్వీ కన్యను అగ్నిసాక్షిగా వివాహం చేసుకో," అన్నాడు.

దానికి అర్జునుడు, "అది ఎలా సాధ్యమవుతుంది? నాకు అన్నలైన నువ్వూ, భీముడూ వివాహం చేసుకోకుండా నే నెలా చేసుకుంటాను?" అన్నాడు.



కాని ఆ సమయంలో పాండవులైదుగురికీ ద్రౌపది పైన మనసుపోయింది. తల్లి అన్న మాటలూ, అర్జునుడు చెప్పిన మాటా, తనలో ద్రౌపది పైన కలుగుతున్న మోహమూ గ్రహించి, ధర్మరాజు, "మన మందరమూ ఈ కన్యను పెళ్ళాడదాం," అన్నాడు.

అంతలో కృష్ణుడు బలరాముడితో సహా పాండవులున్న ఇల్లు వెతుక్కుంటూ వచ్చాడు. అతను తనకూ, కుంతీదేవికీ మొక్కటం చూసి ధర్మరాజు, "కృష్ణా, మేము బ్రాహ్మణ వేషాలు ధరించి అజ్ఞాతంగా బతుకుతున్నాం కదా, మమ్మల్ని ఎలా గుర్తు పట్టావు? ఇక్కడికి ఎలా వచ్చావు?" అని అడిగాడు.

కృష్ణుడు నవ్వి, "రాజా, అగ్నిని ఎలా దాస్తావు? ఇవాళ స్వయంవరంలో ప్రదర్శించిన పరాక్రమం పాండవులకు తప్ప మరొకరికి సాధ్యమా? దుర్మార్గుడయిన దుర్యోధనుడి తంత్రం పారకపోవటం మంచిదయింది. మీరు ఎవరికీ తెలియరాకుండా ఉండటమే మంచిది," అని పాండవుల వద్ద సెలవు తీసుకుని, బలరాముడితో సహా వెళ్ళిపోయాడు.

ఈలోపల ధృష్టద్యుమ్నుడు ఒక పని చేశాడు. మత్స్యయంత్రాన్ని కొట్టి ద్రౌపదిని



గెలుచుకున్న బ్రాహ్మణుడెవరో తెలియదు. అతను ఎక్కడ విడిది చేశాడో, ద్రౌపదిని ఎక్కడికి తీసుకుపోతాడో తెలియదు. అందు చేత ధృష్టద్యుమ్నుడు మిగిలిన బ్రాహ్మణుల వెంట గోప్యంగా బయలుదేరి, అర్జునుడి వెంట కుమ్మరి ఇంటికి వచ్చి, ఒక చోట దాక్కున్నాడు.

కృష్ణబలరాములు వెళ్ళిపోయాక భీమార్జున నకుల సహదేవులు వెళ్ళి, మాధుకరాన్నం తెచ్చారు. అందులో కొంత బలులకూ, అతిథులకూ ఉంచి, మిగిలినది రెండు భాగాలు చేసి, ఒక భాగం భీముడికి, మిగిలినది మిగతా నలుగురికీ పెట్టమని ద్రౌపదికి కుంతి చెప్పింది. ద్రౌపది అలాగే చేసింది.

భోజనాలు అయాక సహదేవుడు దర్భలు పరిచాడు. దాని మీద జింకచర్మాలు పరిచి అందరూ పడుకున్నారు. పాండవుల కాళ్ళ దగ్గిర ద్రౌపది పడుకున్నది.

అప్పుడు పాండవులు యుద్ధ వ్యూహభేదనోపాయాలను గురించీ, వివిధ అస్త్రాల ప్రయోగోప సంహారాలను గురించీ మాట్లాడుకుంటూ, కొంత వితర్కించుకున్నారు. ఇదంతా చాటునే ఉండి విన్న ధృష్టద్యుమ్నుడు, వీళ్ళు బ్రాహ్మణ వేషాలు ధరించిన క్షత్రియులేనని రూఢి చేసుకుని, ఇంటికి తిరిగి వెళ్ళి తండ్రితో చెప్పాడు.

"మన కృష్ణను వెంట బెట్టుకుని వెళ్ళినది ఇద్దరేగాని, వాళ్ళుండే చోట మరో ముగ్గురున్నారు. వాళ్ళ తల్లి ఉన్నది. వాళ్ళు ఉత్తమ క్షత్రియులనటానికి సందేహమేమీ లేదు. వాళ్ళు పాండవులేనని నా అనుమానం," అన్నాడు ధృష్టద్యుమ్నుడు ద్రుపదుడితో.

ఈ మాట విని ద్రుపదుడు తన కోరిక తీరిందని సంతోషించాడు. వాళ్ళను గురించి మరింత వివరంగా తెలుసుకు రమ్మని ఆయన తన పురోహితుణ్ణి పంపాడు.



# లెనిన్ బాల్యం



వ్లదిమిర్ ఇల్యీచ్ ఉల్యానవ్ (లెనిన్) 1870 ఏప్రిల్ నెల 22న జన్మించాడు. ఆయన జన్మించిన సిమ్బిర్స్క్ నగరం వోల్గానది తీరాన ఉన్నది. లెనిన్ గౌరవార్థం ఆ నగరం పేరు ఉల్యానవ్స్క్‌గా మార్చారు.

లెనిన్ తండ్రి పేరు ఇల్యా నికొలాయెవిచ్. వారిది చాలా సామాన్య కుటుంబం. ఆయన తన అన్నగారి సహాయంతో చదువుకుని తరవాత ఉపాధ్యాయ వృత్తిలో ప్రవేశించాడు. విద్యార్థులకు ఆయన అంటే చాలా ఇష్టంగా ఉండేది. ఎందుచేతనంటే ఆయన వారిని ఎన్నడూ శిక్షించేవాడు కాదు, వారి మీద హెడ్ మాస్టరుకు ఫిర్యాదులు చేసేవాడు కాదు. పాఠాలను ఎంతో ఓర్పుతో, పిల్లలకు అర్థమయేలాగా చెప్పేవాడు. చదువులో వెనుకబడిన వారికీ, ఇంటి వద్ద సహాయ పడేవారు లేని పిల్లలకూ ఆదివారాలు ఉచితంగా ప్రైవేటు చెప్పేవాడు. పేద పిల్లలూ, వ్యవసాయదార్ల పిల్లలూ చదువుకునేటందుకు మరిన్ని పాఠశాలలను సిమ్బిర్స్క్‌లో ఏర్పరచటానికి ఆయన చాలా కృషి చేశారు.

లెనిన్ తల్లి పేరు మరీయ అలెక్సాంద్రవ్నా. ఆమె తండ్రి డాక్టరు. ఆమె జీవితం చాలా భాగం పల్లెపట్టుల లోనే గడిచింది. రైతులకు ఆమె అంటే ఎంతో గౌరవం. సామాజిక వినోదాలు ఆమెకు పట్టేవి కావు. ఆమె దాదాపు ఇల్లు విడిచి బయటికి వెళ్ళేది కాదు. ఆమెకు తన పిల్లలతోనే సంతోషమేది. వాళ్ళకు ఆమె అంటే ఎంతో ప్రేమ, ఎంతో గౌరవం.

లెనిన్ ఇలాంటి కుటుంబంలో పుట్టి పెరిగాడు. తల్లిదండ్రులకు అతను మూడవ సంతానం. చిలిపి కళ్ళు వేసుకుని, చాలా సందడి చేసేవాడు. అతని చెల్లెలు ఓల్గ అతని కన్న ఏణ్ణర్థం చిన్నది ఇద్దరూ

ఎ. ఉల్యానవ



లెనిన్ తండ్రి

చలాకీ పిల్లలే. వాళ్ళ ఆటలతో ఇల్లంతా హోరెత్తిపోయేది

లెనిన్ అయిదేళ్ళవాడై ఉండగా తల్లి అతనికి చదవటం నేర్పింది. లెనిన్ తండ్రి పిల్లల పుస్తకాలూ, పత్రికలూ తెప్పించేవాడు. లెనిన్, ఓల్గా గంటల తరబడి చదివేవారు. క్రమంగా వారు రష్యన్ ఇతిహాసాలు చదవటమూ, పద్యాలను కంఠస్థం చెయ్యటమూ చేయ నారంభించారు. కొంత సేపు చదివాక ఇద్దరూ వెళ్ళి గోల చేస్తూ చలాకీగా ఆటలలో నిమగ్నులయేవారు. అతనికి ఆలాటి ఆట అంటే చాలా ఇష్టం.



వేసవి వస్తే పరుగు పందాలూ, ఈతకొట్టటమూ చేసేవాడు. లేకపోతే పిల్లలం నేలుగురం చేసి ఆడుకునేవాళ్ళం. శీతకాలంలో దట్టంగా మంచు పడుతుంది. అప్పుడు లెనిన్ మంచులో జారే ఆటలూ, మంచు ముద్దలు రువ్వటమూ మొదలైన ఆటలు తన స్నేహితులతో కలిసి ఆడేవాడు.

లెనిన్ చాలా అల్లరివాడు. చిలిపిపనులు చేసేవాడు. అయితే అతనిలో ఒక సుగుణం ఉండేది—నిజాయితీ మనిషి. ఏదన్నా కొంటెపని చేస్తే ఒప్పుకునేవాడు. అతను అయిదేళ్ళవాడై ఉండగా అతని పెద్ద అక్క అప్పుడే తెచ్చుకున్న రూలర్ కాస్తా విరగగొట్టి, దాని ముక్క తీసుకుపోయి ఆమెకు చూపి, జరిగినది చెప్పాడు.

"ఎలా విరిగింది?" అని ఆమె అతణ్ణి అడిగింది.

"ఇలా మోకాలి మీదపెట్టి విరిచాను," అంటూ అతను కాలు పైకెత్తి చూపబోయాడు.

"వాడి దగ్గిర దాపరికం లేదు, అదొక సుగుణం," అనేది తల్లి.

అయితే అతని ఎనిమిదో ఏట అది కూడా జరిగింది. కజాన్ లోని బంధువుల ఇంటి అతనూ, అతని తోబుట్టువులూ ఏదో



ఆడుకుంటూండగా ప్రమాదవశాన అతను ఒక బల్లను తోశాడు. దాని మీద ఉన్న పిటికూజా కింద పడి పగిలింది.

పెద్దవాళ్ళు వచ్చి, "ఇది ఎవరి పని?" అని అడిగితే, పిల్లలు, మేము కాదంటే, మేము కాదన్నారు. లెనిన్ కూడా, "నేను కాను," అన్నాడు.

రెండు, మూడు నెలల అనంతరం సిమ్బిర్స్క్‌కు తిరిగివచ్చాక, తల్లి పిల్లలందరినీ పడుకోబెట్టుతూన్న సమయంలో తల్లిని చూసి లెనిన్ బావురుమన్నాడు.

"ఆంటీ అన్నతో అబద్ధం చెప్పాను. ఆ పిటికూజా నేను పగలగొట్ట లేదన్నాను. పగలగొట్టింది నేనే, తెలుసా?" అంటూ అతను వెక్కాడు.



లెనిన్ తల్లి

తొమ్మిదిన్నర ఏళ్ళ వయసులో లెనిన్ బడికి వెళ్ళాడు. విద్యార్థిగా అతను శ్రద్ధాసక్తులు గలవాడు. దీక్షగానూ, జాగ్రత్తగానూ ప్రతి పనీ చేయటం తండ్రి మా కందరికీ అలవాటు చేశాడు. లెనిన్ పాఠాల వివరాలు చాలా శ్రద్ధగా ఆలకించటం వల్ల అతనికి చదువు బాగా అబ్బుతున్నదని అతని అధ్యాపకులు అనేవారు. దానికి తోడు అతను చదువులో చాలా చురుకు. బడిలో పాఠాలు శ్రద్ధగా వినేవాడు, ఇంటి దగ్గర అతిక్షిప్రంగా వాటిని నెమరుకు తెచ్చుకునేవాడు. అతని హోమ్ వర్క్ మిగిలినవాళ్ళ దాని కన్న చాలా ముందే ముగిసేది.

తండ్రి ఇంట్లో ఉండటం జరిగినప్పుడు ఆయన లెనిన్‌ను తన గదికి తీసుకుపోయి, మిగిలిన పిల్లలను అతని బారి నుంచి కాపాడి, అతను చేసిన హోమ్ వర్క్ తనిఖీ చేసేవాడు. సాధారణంగా అందులో తప్పులుండేవి కావు. ఆ తరవాత తండ్రి అతనికి మరేదన్నా పని కల్పించేవాడు. లేకపోతే ఇద్దరూ కూర్చుని చదరంగం ఆడే

వాళ్ళు. ఆటుతరవాత భోజనాల గదిలో ప్రశాంతి అనేది లేకుండా పోయేది.

లెనిన్ తండ్రికి చదరంగం పిచ్చి జాస్తి. అదే ఆయన కొడుకులకూ వచ్చింది.

లెనిన్ ఏ పని చేసినా అమిత దీక్షతో చేసేవాడు. అతను చదరంగం ఆటను పుస్తకాల సహాయంతో నేర్చుకుని, కాల క్రమాన చాలా గట్టి చెయ్యిగా తయారయాడు. పిదప్పా గ్రామంలోగాని, ప్రవాసంలోగాని ఉన్నప్పుడు చదరంగమే అతనికి ప్రధాన కాలక్షేపమయింది. విద్యార్థిగా ఉండిన కాలం అతను తన అన్న సాషతో "ఒక ఎత్తు" వెయ్యటానికి మహా ఉబలాటపడేవాడు. సాష ఏం చేస్తే తాను కూడా అదే చేసేవాడు. అతిస్వల్ప విషయాలలో కూడా సాషను అనుకరించేవాడు. సాష చాలా గంభీరుడూ, ఆలోచనాపరుడూ, కర్తవ్యనిరతుడూ కావటం లెనిన్‌కు చాలా లాభించింది. తమ్ముడు అన్న నుంచి బుద్ధిని కేంద్రీకరించటమూ, సూక్ష్మపరిశీలనా, ఏ పని చేసినా శ్రద్ధగా చెయ్యటమూ, అంతులేని పరిశ్రమా అలవరుచుకున్నాడు.

లెనిన్‌కు సాష అంటే చాలా ప్రేమ. పని చెయ్యటం విషయంలోనే గాక, మనుషులతో వ్యవహరించటం విషయంలో కూడా సాష మా అందరికీ మార్గదర్శిగా ఉండేవాడు. అతని నేర్పు, మృదు స్వభావమూ, న్యాయబుద్ధీ, పట్టుదలా మమ్మల్ని అమితంగా ఆకర్షించాయి. వ్లదిమిర్ (లెనిన్) చాలా కోప స్వభావుడు. అయితే సాషలో ఉండే నిండుతనమూ, ఆత్మనిగ్రహమూ మా అందరినీ, ముఖ్యంగా వ్లదిమిర్‌ను, మార్చాయి. అతను పట్టుదలగా తన దౌర్బల్యాన్ని జయించాడు. పెద్దయాక అతనిలో నేను ఎన్నడూ ముకోప్యం చూడలేదు. —(ఇంకా వుంది)

లెనిన్ జన్మించిన ఇల్లు



# 101. జోన్ ఆఫ్ ఆర్క్ చిహ్నం

ఫ్రెంచివారి స్వాతంత్ర్య చిహ్నం జోన్ ఆఫ్ ఆర్క్. ఆమెను "ఆర్లియన్స్ కన్య" అని పిలుస్తారు. ఐదు శతాబ్దాల క్రితం సజీవదహనం పొందిన స్థలంలో—రూ ఆఁ నగరంలో—ఆమెకు ఈ స్మారక చిహ్నం నిర్మించారు. మే 8 స్వాతంత్ర్యదినం, అదే ఆమె దినం కూడాను. గత యుద్ధంలో 1943 మే 8 నాడే ట్యూనిస్‌నగరం శత్రువుల నుంచి విముక్తం కావటం చిత్రం.



Photo by Prasad



బహుమతి
పొందిన వ్యాఖ్య

కలత నిద్రలో నేను

పంపినవారు :
హసన్ బేగం, శక్తిపాలవరం

Photo by V. Thithu



బహుమతి
పొందిన వ్యాఖ్య

కలలు కంటున్నాను

పంపినవారు:
హసన్ బేగం, రెడ్డిపాలవరం

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1970 జూన్ నెల సంచికలో ప్రకటించబడును





* పై ఫోటోలకు సరి జన వ్యాఖ్యలు ఒక్కొ మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)
* ఏప్రిల్ నెల ఆఖరు తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలించబడవు.
* మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న పెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 20/- లు బహుమానం.
* వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి :- చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

---

## ఏప్రిల్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : కలత నిద్రలో నేను

రెండవ ఫోటో : కలలు కంటున్నాను

పంపినవారు : హసన్ బేగం C/o అబ్దుల్ సత్తార్, రెడ్డిపాలవరం. (పశ్చిమ గోదావరి జిల్లా)

బహుమతి మొత్తం రు. 20/-ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'




# బ్రిటానియా గ్లాక్సో® బిస్కట్లు

బ్రిటానియా గ్లాక్సో బిస్కట్లు పుష్కలంగా పాలు, ఇతర పోషక పదార్థములు చేర్చి తయారు చేయబడినవి అందువలన త్వరగా పెరిగే బిడ్డలకు కావలసిన ఎక్కువ పోషకత్వాన్ని చేకూర్చుటకు ఈ బిస్కట్లు అత్యుత్తమమైనవి. మీ బిడ్డలకు కూడా ఎక్కువ పోషకత్వము కోసం బ్రిటానియా గ్లాక్సో బిస్కట్లను ఇవ్వండి.






అంటే నాణ్యత

